# బ్రిటిషు పరిపాలన సౌఖ్యము


రచయిత

భాగవతుల లక్ష్మీపతి శాస్త్రి





సరస్వతీ పవర్ ప్రెస్ - రాజమహేంద్రవరము.

1931

మూల్యము 4 అణాలు

# FOREWORD

INDIA which was subject to many troubles under the unjust rule of the Hindu and Mahammadan Kings of the old has been under the beneficent rule of the English who are the mightiest among all the nations of the world and the most gracious towards its subjects and it is prospering day by day under their Sovereignty.

But of late it has been again subject to many sufferings on account of the Satyagraha movement and the object of this work named "The Advantages of the British Rule" is to emphasize the fact that only those who free themselves from the fetters of the above movement and who manifest their loyalty to the Crown in these critical times will be above all such sufferings and that only those prosper and none else.

May the Almighty bless our mighty Emperor who has ever been raining his munificence over his subjects and his family with long life and prosperity.

*Ramachandrapur*
*Godavari*
18—4—1930

**Bh. Lakshmipathi Sastry.**

# PRINTER'S OPINION



It is with the greatest pleasure that I introduce to the public world Brahmasri Bhagavatula Lakshmipathi Sastry Garu, the author of many standard books in the Religious field, the editor of the Sathapatha Brahmana, Samhita etc. according to the kanva recension, a research worker in Telugu as well as Sanskrit Literature and the author of this book, which has styled "Advaatage of British Rule."

The first, second and third editions of the book have been exhausted within a period of three months and the necessity that has arisen to bring out the fourth edition encourages the author to believe that his humble work has met the requirements of the Public.

I feel greatly encouraged by the favourable approbation and the reception accorded to Mr. Sastry's book. This is clear from the fact of the coming out of this edition in a very considerably limited time. The Author has taken advantage of the opportunity afforded by this new edition to revise the book thoroughly and make it up to date. Every care has been taken to enhance its usefulness. I wish God speed for the enterprise.

TENALI
22nd July 1930

**M. Veerabhadra Rao,**
*Printer,*
*Rama Krishna Printing Works.*

# పీఠిక

పూర్వము హిందూమహమ్మదీయ ప్రభువులచే న్యాయానుకూలముగాఁ బరిపాలింపఁబడని కారణమునఁ బలుపాట్లు పడిన భరతఖండ మిప్పుడు న్యాయానువర్తనులును, ప్రపంచమునఁ గల సకల జాతులవారలలోను మహాబలిష్ఠులును సత్యసంధసంపన్నులును నగు నింగ్లీషువారి యేలుబడికి లోనై సర్వవిధములను సకలసౌఖ్యముల నందుచున్నదనియు, ఈనడుమ సంభవించిన సాహాయ్యనిరాకరణపీడచే నది మరలఁ గొన్నికష్టములపాలు కావలసి వచ్చుచున్నదనియు, దానిని దిరస్కరించుచు రాజభక్తి కేవిధమునను గొఱఁతను జూపని వారలెట్టి యిడుమలకును లోనుగాక బహువిధముల సౌఖ్యమును బడయుదురనియును దెలుపుటయే యీ గ్రంథముయొక్క ముఖ్యోద్దేశ్యము,

మఱియుఁ దమ పాలనములో నున్న ప్రజలకెన్నియో విధముల మేలొనఁగూర్చియు, నొనఁగూర్చుచును, నొనఁగూర్ప నెంచియు నుండిన శ్రీ శ్రీ శ్రీ జార్జి సార్వభౌములకును వారికుటుంబమునకును దేవుఁ డాయురారోగ్యాది సకలభాగ్యముల నిచ్చి సతతము సంరక్షించుఁగాక !

రామచంద్రపురము,
గోదావరి
18—4—30



ఇట్లు
భాగవతుల లక్ష్మీపతిశాస్త్రి.

# సప్తమ ముద్రణము.

షష్ఠ ముద్రణమునందు వలె నీ ముద్రణమునందు నందందుఁ గొన్ని మార్పులొనర్చుటయే కాక కొన్ని నూతనాంశములను సహితమును జేర్చి గ్రంథమును విస్తరింపఁజేసినాఁడను. అందులకు హేతువు గత ముద్రణ షట్కమందలి గ్రంథములెల్ల నచిరకాలములో విక్రయింపఁబడుటయె.

రామచంద్రపురము<br>7 ఫిబ్రెవరి 31

భాగతుల లక్ష్మీపతిశాస్త్రి.

# బ్రిటీషు పరిపాలన సౌఖ్యము

ఆంధ్రదేశీయులారా! బ్రిటిషు ప్రభుత్వమువలన భారత ఖండవాసులు పడయుచుండెడి సౌఖ్యములకు మితియే లేదని చెప్పిన నతిశయోక్తి యెంతమాత్రమును గాఁజాలదు. వానిలో నొక్కొక్కదాని నెత్తి వ్రాయఁబూనిన గ్రంథ బాహుళ్యమగును. అందుచేఁ జాదకులకు విసువును జనింపవచ్చును కావున బహు గ్రంథమగుదానిని జిన్నిపొత్తమున నిముడునట్లు వ్రాయుటయే లోపముగాఁ గాన్పించు నేమో; కాని జనుల సౌఖ్యానుభవమున కేలోపమును గాన్పించు నంచుకు లేదని నాతలంపు. అందును సామాన్యముగా నందఱకును దెలియఁదగినవియుఁ దెలిసిన వారలు మరల మరల స్మరింపఁదగినవియు నగు వానిలో ముఖ్యమగువానిని బదివం(డ్రెండింటిని బేర్కొనిన పిదపఁ బరిపాలకులకు మనమేల పన్నులీయవలసియున్నదో తెలిపెదను. ప్రపంచమందలి యే వస్తువుయొక్కయైనను గుణదోషములను బాగుగాఁ గనుఁగొన నెంచినపుడు మున్ముందుగా దానియొక్క పూర్వాపరస్థితులను జక్కఁగా నాలోచించిన పక్షమున నవి యెల్ల మనకే విశదమగును. ఒకరు చెప్పుచుండినదానిని బట్టి యెట్టి విమర్శనమును జేసికొనకయే విశ్వసించుట మూర్ఖుల లక్షణమనిపించుకొనును; గాని బుద్ధిమంతుల లక్షణమనిపించు కొనదు. 'ఇంగ్లీషు ప్రభుత్వమువలన మనకిప్పుడు సౌఖ్యము కలుగుచున్నదా? కష్టము కలుగుచున్నదియా? అనెడిదియే

ప్రస్తుతవిషయము; కావున హిందూదేశము పూర్వమే స్థితిలో నుండెను? ఇప్పుడు బ్రిటిషుపాలనము నందెట్టి స్థితిలో నున్న దని విమర్శించుకొంటిమేని మనకే హిందూదేశ మాంగ్లేయులచే నెంతయో బాగుగాఁ బరిపాలింపఁబడుటచేత నందలిజనులు సకలసౌఖ్యములను బడయుచున్నారని తెలియఁగలదు. దానిని బట్టి పాఠకులకు విపత్తులగువారలు బోధించెడి బోధనల యొక్క తత్త్వ మెంతటిదో తేటపడక పోదు. ఇప్పటిస్థితిని మన కన్నులారఁ జూచుచున్నారము కానఁ దెలియును; గాని పూర్వావస్థ మనకెట్లు గోచరించునందురా! పూర్వస్థితిని దెలుపుటకుఁ జరిత్రములే కాక గ్రామవృద్ధులగు వారలును బారంపర్యముగాఁ జెప్పుకొనెడి గాథలును గలవు. ఆ కాలము నందు రాజ్యమేలువారలు లోలోపలతో ననవరతమును బోరాడుచుండెడి వారలనుమాట యటుంచినను మహమ్మదీయప్రభువులు విడువక హిందూరాజులతోఁ బోరాడుచుండెడి వారలు. ఏలికలావిధముగ నుండియున్నపుడు గ్రామములగతి యెట్లుండెనని యాలోచించితిమా! తఱచుగా దగ్ధములు చేయఁబడుచుండెడివనియు, భూములసంగతి పరిశీలించితిమా! ఎక్కడనో యొకచోటను గాని తక్కిన భూములెల్లను సేద్యమును నదియే లేక వ్యర్థముగా బీడుపడి యుండెడివనియు, జనుల విషయము పరికించితిమా! వారుకొల్ల పెట్టఁబడుచుండెడివారలనియు, రాజులు కైకొనెడి పన్నులను బరీక్షించితిమా! వారు ఫలాదికమున కేవిధమగు దారిని జూపకయే కైకొనడి పన్నులకుఁ బరిమితియే లేకుండెడి దనియు, జనులు దూరదేశ

యాత్రలుచేయుట యెట్లుండెనని చూచితిమా! దేశమునంతంత టను విచ్చలవిడిగా బంగకాండ్రును, దొంగలును సంచరించు చుండెడివార లనియు నందుచేత ననేకులు గుంపులు గుంపులుగాఁ గూడికొని చేత నాయుధములు పట్టియుండినఁగాని జనులు దూరదేశయాత్రలు చేయుట దుర్ఘటముగా నుండెడి దనియుఁ దెలియును. పోనిండు! వీని కేమి! ఇవియెల్లను జనుల సామర్థ్యమునుబట్టి కాలక్రమమునఁ దొలఁగిన వనెడి పిచ్చి తలంపు గలిగినను నా కాలమునఁ బ్రజ లొక ప్రదేశమునుండి వేఱొక తావునకుఁ బోవుట కిప్పటివలె మృగచోరభయాదులు మృగ్యములై యుండెడి మంచి మంచి బాటలున్నవా? యని ప్రశ్నించినచో నెట్టి ధీమంతుఁడైనను మున్నాటికిని లేవు లేవనియే చెప్పవలయునుగదా! సామాన్యజనుల కట్టి త్రోవలే లేకుండినచో నయోమార్గములు గలవా? తంతివార్తలున్నవా? పత్రికాస్థానము లున్నవా? వివిధవిద్యలను నేర్పెడి విద్యాలయము లున్నవా? సింహాసనము నధిష్ఠించి యుండు మహారాజునకును వీధులయందుఁ దిరుగాడు దరిద్రునకును తుల్యముగా న్యాయమును బడయుటకు న్యాయస్థానము లున్నవా? సకలదేశ ప్రవృత్తిని దెలిపి మనుజులకు లోకజ్ఞానమును బోధించెడి పత్రిక లున్నవా? అల్పమూల్యమునకు దొరకెడి ముద్రితపుస్తకము లున్నవా? సేద్యమునకును వాణిజ్యమునకును గంగాది నదులకు నూఱులకొలఁది మైళ్ళవఱకును లక్షలకొలఁదిని పౌనుల ధనమును వ్యయము చేసి త్రవ్వింపఁబడిన కాల్వ లున్నవా? జంతుసంతానమును బహు

విధములు హింసింపక వివిధ కర్మములను దీర్చెడి యంత్రము
లున్నవా? యంత్రాలయము లున్నవా? యని ప్రశ్నించు
కొంటిమా! అయోమార్గములు లేవు నిరయోమార్గములు
లేవు; తంతివార్తలు లేవు నింతివార్తలు లేవు; పత్రికాస్థాన
ములు లేవు నిత్రికాస్థానములు లేవు; వివిధశాస్త్రములను
విద్యలను నేర్పెడి విద్యాలయములు లేవు నిద్యాలయములు
లేవు; క్రమమైన న్యాయస్థానములు లేవు నిన్యాయస్థానములు
లేవు; ధర్మవైద్యశాలలు లేవు నిర్మవైద్యశాలలు లేవు;
ధనాగారములు లేవు నిరాగారములు లేవనియే చెప్పు
కొనవలయును. ఇంతయేల! ఇపుడు గాన్పించెడి వానిలోం
బూర్వ మొకటియైనను లేదు. అదేమనవలెను? ధనాగారములు
లేవనుటయేప్పు! అప్పటివారలు తమధనము నెట్లు దాచు
కొనంగలిగి యుండురో! వారు తమధనమును భూమిలోం బాతి
పెట్టి కాని యాభరణములుగం జేసికొని కాని దాంచుకొనెడి
వారలు. అంతియేకాదు! అప్పటి రాజకీయోద్యోగులు జను
ధనమును గొల్లగొట్టుచుండెడి వెఱపుచే ధనవంతులు తాము
ధనముగలవారలైనట్లుగాం గాన్పింపకుండులాగున బీద వేస
ములు వైచికొని తిరుగెడివారలు.

ఇంక బ్రిటిషువారి పాలనమునందు జను లెట్లుసుఖులై
యున్నారో చూతము! వారు న్యాయ్యముగాం బరిపాలనము
చేసెడి ప్రభువులగుటచే జనులు తస్కరుల మూలమునం గాని
క్రూరజనమువలనం గాని యెట్టి భయమును లేకయుం దాము
వాంఛించిన మతమును నవలంబించుచు రోగపీడితులైన

పుడు పాలకులచే స్థాపింపఁబడిన వైద్యశాలలకుఁ జని చికిత్స చేయించుకొనుచును, దంత్రీవార్తామూలమునఁగాని పత్రికావహన కార్యస్థానముల మూలమునఁ గాని సొమ్మును లేఖలను దాము పంపనెంచినవారలకుఁ బంపుకొనుచును, సకలదేశములకును భయరహితులై స్వేచ్ఛగాఁ బ్రయాణము చేయుచును, నెట్టివెలుపును లేకయే క్రయవిక్రయములను జేయుచును, కళాశాలలందు వివిధకలలను నేర్చికొనుచును, సర్వత్ర సకల సస్యములను బుష్కలముగాఁ బండించుకొనుచును, సకల పరికరములతోఁగూడిన దివ్యభవనములను నిర్మించుకొని నిర్భీతితో నివసించుచును, నిచ్చవచ్చిన రీతిని వస్త్రాలంకారాదులను దాల్చి తిరుగుచును, నేవిధమునను దారిద్ర్య మనునది లేక సకలవిధములను సుఖముగాఁ గాలము కడపుచున్నారు. వీని యన్నిటికంటెను ముఖ్యమైనది దొరతనమువారు మనకుఁ గావలసినంత స్వేచ్ఛను గలిగించియున్నారు. తప్పిదమునకుఁ దలపడక యుండినపక్షమున సకలజనులును మహారాజులవలె నుండి స్వాతంత్ర్యముతో నిఖిలసౌఖ్యముల ననుభవించుచుఁ గాలము పుచ్చవచ్చును. పూర్వమువలెఁ గొన్నికొన్ని వర్ణములవారలు పల్లకుల నెక్కరాదని కాని చదువుకొనరాదని కాని గోడలకు వెల్ల వేసికొనరాదనికాని శాసించి యుండిరా లేదు. మన పురాణములలో వర్ణింపఁబడినట్లుగాఁ జిరజీవుల వంటి వార లెవ్వరైన యుండి యీ భరతఖండముయొక్క పూర్వస్థితినిగూడఁ జూడఁగలిగిన పక్షమున నప్పటి భరతఖండమునకును మన యిప్పటి భరతఖండమునకును నరకమున

కును స్వర్గమునకును నున్నంతో వ్యత్యయమున్న దని చెప్పక పోయెడివారలా! ఇదియే ప్రాచీనపరిపాలనములనకును వార్త మానికపు శాసనమునకును గల భేదము. ఇంక నెన్నియో బ్రిటిషుపాలనము వలని లాభములు గలవు; వాని నెల్ల నిందుఁ జూపిన గ్రంథవిస్తరమగునని వదలివేయుచున్నాఁడను.

ఇంకను బూర్వోక్తవిషయములలోఁ గొన్నిటి నెత్తి విమర్శింతము! బ్రిటిషువారు మన భరతఖండమునందుఁ గాలిడకమున్న రాజపుత్రులు, మహారాష్ట్రులు, ఆఫ్ఘనులు, సీకులు, మొగలాయీలు, పిండారీలు మొదలగువారలెందఱో పాలకులై యుండిరి. వారలలోఁ బరాక్రమవంతులు పరాక్రమ హీనులపై నిరంతరము దాడి వెడలుచుండెడివారలు. అందుచే నొక వేయిసంవత్సరముల కాలము భరతఖండము యుద్ధము లచేఁ గలిగిన రుధిరప్రవాహములతోడను, చౌర్యము మొదలగు దుష్కార్యములతోడను నిండియుండెను. దీనినిబట్టిబహు నాయకత్వమువలననే దేశమునకైనను సౌఖ్యమునను కల్లయని చెప్పవచ్చును. ఈహిందూదేశ మల్లు పరస్పరము కలహింపఁ జొచ్చెడి హిందూమహమ్మదీయ ప్రభువులచేతనే కాక మఱి కొందఱిచేతను బీడింపఁబడినది. ఈ భరతఖండము పైకిఁ బలుమాఱు గజనీసుల్తాను మహమ్మదును, సుల్తాను మహమ్మదు ఘోరును, తైమూరును, నాదరుషాయును, పారసీకులు మొదలగువారలేకాక యనేకేతర జాతులవారును నుత్తరదేశములనుండి దండెత్తివచ్చి యీదేశము నాక్రమించుకొని ప్రజలను బలువిధములను బాధించి యంతమొందించుటయే కాక మత

ద్వేషములను బూని దేవాలయాదులను నాశన మొందించెడి వారలు. ఇంకను మఱి యెన్నెన్నో దుష్కృత్యముల కొడిగట్టెడి వారలు. ఆకాలమునఁ బాలకులపైఁ దిరుగుబా టొనర్చెడి వారలను జిత్రవధ గావింపక వదలెడి వారలా! అట్టి విపత్తు స్వప్నములందైనను గాన్పించుచున్నవా! పైనిచెప్పఁబడినట్లుగాఁ బరరాష్ట్రముల వార లెవ్వరును హిందూదేశముపైఁ బడి బాధింపకుండులాగున మహాబలిష్ఠులును నత్యంత ధనసంపన్నులును నగు బ్రిటిషువారు దీని కుత్తరభాగమునందు బలిష్ఠమగు దుర్గావళిని నిర్మించుటయే కాక యందుఁ జమూసమూహము నుంచి యున్నారు. అట్లే జలభాగము నుండియు నితరదేశముల వార లిందుఁ బ్రవేశింపకుండుటకై యుద్ధనావలను సముద్రముపై సంసిద్ధము చేసి యుంచిరి. ఆకారణమున నిప్పు డితరదేశముల వారలు భూమార్గమునఁ గాని జలమార్గమునఁ గాని తుదకు గగనమార్గమునఁ గాని వచ్చి మనలను బూర్వమునవలెనే కష్టపఱుపకుండుటకై నిర్మిన యనీకమునకగు వ్యయమును మనము పన్నులీయకుండిన వేఱు మున నెక్కడనుండి వచ్చును! వేతనమును గైకొనక యెవ్వరును నేపనియును జేయరు గదా! కావున మన రక్షణమునకై మనము పన్ను లీయవలసియున్నది. ఈ ప్రవృత్తి యెట్టిదో చక్కఁగాఁ బరీక్షింపుఁడి! అంత నదియెల్ల మీకే తెల్లమగును.

దొంగతనముకొక్క మతేవృత్తియు నెఱుఁగని తక్కువ జాతులను బట్టి చెఱసాలలం గిడి బంధిపోటు దొంగతనము లోనుగాఁగల క్రూరకార్యముల నడుగింటఁజేసిన దాంగ్లేయులే!

అదెట్లందురా! థగ్గులనెడి పాశకరులు వణిజుల వేషము వైచి
కొనియు, సాధువులగు సద్భాగులవలెఁ గాన్పించియు నుత్తర
హిందూస్థానమునందే కాక మధ్యపరగణాలయందును సంచ
రించుచు నూఱులకొలఁది సంవత్సరములు పాంథులనుబట్టి
పీడించెడి వారలు. వారు మార్గమునఁ బ్రయాణముచేయు
వారలతోఁ గలసి మెలసి పయనించుచు దట్టమగు నడవుల
నడిమికి వచ్చినపుడు సమయమును గనిపెట్టి పాశములను
బోలిన తమతలగుడ్డలతో యాత్రాపరుల మెడల కురివోసిచంపి
వారలకడ నున్న ధనమెల్లను హరించుటయే కాక వారి
దుష్కృత్యమితరులకుఁ దెలియకుండులాగున నామృతశరీరము
లను బూడ్చిపెట్టిపోయెడు వారలు. అప్పుడు కాశీ లోనుగాఁ
గల స్థలములకు యాత్రలు చేయు సద్భాన్యులెందఱో యీ
విధముగాఁ బరలోకముల కనుపఁబడుచుండెడివారలు. అట్టి
దుండగములు దేశమునందెన్నో ప్రబలి యుండుటచేతనే మన
వారలు పూర్వము కాశికిఁ బోయిన వాఁడును గాటికిఁ
బోయినవాఁడును సములనిరి. పైనిచెప్పినట్లొక పాశకసులేకాక
దొంగతనముచేతనే జీవించెడి నీచజాతు లనేకములుండెడివి.
అట్టివాని నన్నిటిని బట్టి నిర్మూలము కావించి పథికులకు
మార్గములందు వెఱపు లేకుండఁగఁ జేసినది యింగ్లీషువారలు
కాక మఱెవరు? అందుచేతనే మునువటివలెఁ బందిపోటు
దొంగతనమును దారిదోపిడులును వినరాకున్నవి. ఇంతయేల!
ఇప్పుడు మనము వీథిలోఁ బాఱవేసికొన్న వస్తువైనను భద్ర
ముగా నుండును. అట్లు వారలొనర్చిన మేలును మఱచి వా

లను దూషింప బోరఁకొనుట సత్పురుష లక్షణ మగునా?

ఆంగ్లేయులచేతనే యనేకఘోరాచారములు మొట్ట మొదటికి నశింపఁజేయఁబడినవి. వారు రాకముందు హిందూ దేశమునఁ బ్రబలముగా నుండెడి నరబలులుగాని, భర్తలు మృతినందఁగా భార్యలును దమ భర్తృశవములతోఁ బాటు దహింపఁబడుటకాని, రాజపుత్రులలో నుండెడి నిక్కలి కౄర కార్యమగు నాఁడుపిల్లలు కల్గినంతనే వారలను జంపివేయుట కాని యేది? ఇట్టి విప్లవాడాంగ్లేయులచే రూపు మాయఁజేయఁ బడిన వని మన మందఱ మంగీకరింప వలసినదే కదా. అట్లు కాదనుకొనువార లింగ్లీషువారి యేజెంటయిన కర్నలు వాల్టరుదొరగారు పదునెనిమిదివందల యెనుబదియేడవ (1887) సంవత్సరమునఁ జూర్చిన రాజపుత్రస్థాన హితకారిణీ సభా వృత్తాంతమును గనుఁగొనినఁ దనివి నందఁగలరు.

మార్గాయాసము వలననే కాక వర్షపాతము చేతను నెండచేతను జోరులమూలమునను రోగముల మూలమునను విశేషబాధ కలుగుచుండెడి పథికులకు సకలసదుపాయములను జూచిన దాంగ్లేయులే! వారి స్వాధీనము లోనికి నీహిందూ స్థానము రానప్పుడు మంచిబాట యొక్క కొక్కటియైనను గల దని చెప్పఁజాలముకదా. ఆకాలమున దరిద్రులు దూరదేశము నకుఁ బోవలసి యుండినప్పుడు దినమంతయుఁ గాలి నడకను బయనము చేసిచేసి నిశాసమయమునందు మాత్రమే యేచెట్టు దాపుననో యే గుట్టచెంతనో బడలికను దీర్చుకొనెడివారలు. అనువగు మార్గము లుండకుండుటచే శకటము లెప్పుడో కాని

యుపయోగపడెడివి కావు. ధనికులగువారలుమాత్రము యాప్య యానములపై నెక్కి కాని గుఱ్ఱములమీఁదను గాని గంటకు గవ్యూతిదూరము మాత్రమే కదలి పోఁగలిగెడి వారలు. వర్షకాలమునం దట్టును బయనించుటయు బహు కష్టతముగా నుండెడిది. ఇన్నిమాట లేల? కాశికిఁగాని కలకత్తాకుఁ గాని పోవలయునన్న నెన్ని నెలలు కడచెడివో కనుఁగొంటిరా? ఆఱుమాసములు మొదలుకొని తుదకొక సంవత్సరమైనను గడువవలసి యుండెడిది. అట్టి దీర్ఘకాలయాపనమే కాక ద్రవ్యములును నూఱులకొలఁదిని వెచ్చింపఁబడుచుండెడివి. అట్లయ్యును సుఖముగా మరలివచ్చి యిల్లు చేరుట మహాభాగ్యమనియే చెప్పుకొనెడివారలు. అట్టికష్టములన్నియు నిప్పుడు కడతేఱి యెండయనక వానయనక నూఱులకొలఁది మైళ్ల దూరమందున్న ప్రదేశములకుఁగూడ సుఖముగా నొక బండిలోఁగూర్చుండి యే రెండుమూఁడు దినములలోనో పోయి చేరఁగలఁడు. అట్టిసౌఖ్యమునకు బ్రిటిషువా రేర్పఱచిన యినుప దారియే కారణమని నిశ్చయింపరాదా! ఒక్క యినుప మార్గమే యననేల? సాగరములమీఁదను బొగయోడలుకూడ వేయఁబడియుంటచే చరనగరముల లాగున నవి బయలుదేఱి వివిధఖండములందుండెడి విచిత్రవస్తువులను మనకు దొరకు నట్లు చేయుటయే కాక నానాదేశములవారితోడి కూటమిని బట్టి నాగరకతనుగూడ నభివృద్ధిచేయుచున్నవి. పెక్కుమాట లేల! తుదకుఁ గడువేగముగా గగనమున గమించెడి విమానములనుగూడఁ గనుఁగొనిరి కదా! ఏమి! "స్వరాజ్యము! స్వరా

జ్యము" అని పలవరించుచు నాంగ్లేయులను నిరసించెడి పురుష పుంగవులను వేలునుడఁచి చూపుమనుఁడి! తొల్లి యెందైనను భూమిమీఁదఁగాని, యాకసమునఁగాని, జలములపైఁగాని త్వరితముగా దూరదేశములకు సయితము పోయివచ్చుటకు యంత్రవ్యాపార ముండియున్న దేమో! పూర్వము భరతఖండ మందలి గంగాది నదుల జలము నిరర్థకముగాఁ బోయి సాగర మునఁ జేరుచుండెడిది. ఇప్పు డన్ననో బ్రిటిషువారు లక్షల కొలఁదిని ధనమును వ్యయముచేసి యా యాపగులకు సేతువు లను గట్టించియు నూటులకొలఁది మైళ్ల పొడవునను బహు శాఖోపశాఖలతోఁ గూడిన కాలువలను త్రవ్వించియు నా పావ నోదకములను దేశమునందంతటను బ్రవహింపఁజేసిరి. అట్లనేక శాఖోపశాఖలతోఁ గూడిన యాకుల్యలు మనుష్యులనే కాక సరకులను గొనిపోయెడి పడవలు నడచుటకును, జేలకు నీళ్లు పెట్టుటకును గూడ సుపయోగపడుచున్నవి. కాఁబట్టి పూర్వ మువలె భూము లనేకము లెక్కకుఁజూచినను బీడుపడియుండక సాగుబడి యగుచున్నవి; పట్టభూములు సహితము పంటభూము లగుచున్నవి. వానివలన నిట్టిసదుపాయములే కాక సామాన్య ముగాఁ ద్రాఁగుటకుఁ బల్లెయూరివారికిని మంచినీరు దొరకుట తటస్థించినది. కావునఁ బూర్వ మెన్నఁడును జేయని జీవదాన మును సైతము బ్రిటిషువా రొనర్చిరని చెప్పకొనక తప్పదు. అంతియే కాదు; వారివలనే నీ దేశమునందలి ప్రతిభాగమునం దును మంచిమంచిమార్గములు వేలకొలఁది క్రోశముల దూర ముదనుకను వేయింపఁబడియున్నవి. అందుచే నిప్పుడు వారి

శాసనముమూలమునఁ జోర భయాదులులేకయే యొంటరిగా నైనను నరుఁడు యెంతనవ్వఁదనుకనైనను బ్రయాణముచేసి రాఁగలఁడు. పూర్వమన్ననో యయోమార్గములుకాని, కాల్వలుకాని, సుపథములుకాని లేవు. ఉన్న యడవి మార్గములైనను వ్యాఘ్రాదిఘాతుకమృగముల తోడను వానికంటెను గడుఁ గ్రూరులైన చోరులతోడను నిండియుండుటచే జనులు గుంపులు గుంపులుగాఁ గూడి వెడలుచున్నను వెఱపుచక్కి వెడలఁజాలక పోయెడివారలు. అట్టివ్యథలెల్లను గడచనఁజేసిన దాంగ్లేయులందురా! అనరా! సతిరియొక విశేషము. అట్టి యయోమార్గాదులు లేకున్న నిత్యమును మనకుఁ గాన్పించెడి చిత్రవిచిత్రమగు వస్తుజాల మెక్కడనుండి వచ్చును? అంతియే కాదు; పూర్వము కాటకముపట్టిన స్థలముల కితరదేశముల నుండి ధాన్యాదులువచ్చెడి వీలులేక యసంఖ్యజనులు మలముల మాఁడి చావవలసినవారైరి. ఈ బ్రిటిషుపాలనములో నట్లగుచున్నదా! లేదు! లేదు! ముమ్మాటికిని లేదు. పండినప్రదేశములనుండి యొండినయూళ్లకు నయోమార్గాదుల మూలమున ధాన్యాదికము కొనిపోఁబడుచున్నది. అందుచే నిప్పుడు వానలు కురియకున్నను బంటలు పండకున్నను గఱవను మాటయే వినరాకున్నది. వీరి యేలుబడిలో నొడలు వంచక పూర్వులార్జించిపెట్టిన ధనమెల్లను దుర్వ్యయములకై వినియోగించి కాళ్లు చాఁచుకొని కూర్చుండు వారలకుఁ గూటికిని గుడ్డకును గఱవగు నేమో; కాని యొడలు వంచెడివారలకెల్లరకును గూడుగుడ్డలకు గఱవగుటలేదు. ఇదియు నదియు

ననసేల? తొల్లి దుఃఖజనక మగు నదియెల్ల నిప్తతి సౌఖ్య దాయకమై యున్నదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

నిఱుపేదయగు కూలివాఁడు సహితమును న్యాయమును బొందుటకుఁ గ్రమమగు న్యాయస్థానముల నేర్పఱచినది బ్రిటిషువారే! వీరు న్యాయసభ లేర్పఱచి మహారాజు మొదలు మహాదరిద్రునివఱకును గల జనులందఱును విధేయులై నడచుకొనులాగున ననేకములకు శాసనముల నేర్పఱచి యాచరణములోనికిఁ దెచ్చిరి. అట్లు వారు నిర్మించిన చట్టములను బూర్వమువలె నెవ్వరికిని దెలియకుండులాగున దాఁచియుంచక యాయా చట్టములందున్న విషయముల నెల్ల నెల్లరకుఁ దెలియుటకై ముద్రించి ప్రచురించుచున్నారు. కాన నీ కాలమునఁ బల్లెలలో నుండెడి పామరులకు సైతము లోకవ్యవహార జ్ఞానమలవడియున్నది.

పూర్వమనేక రాజులచే ననేక విధములుగాఁ బాలింపఁబడిన హిమాలయము మొదలు కన్యాకుమార్యగ్రమువఱకు నుండెడి దేశమును నేకరాజశాసనముక్రిందికిఁ దెచ్చిన దాంగ్లేయులే! పూర్వము వేఱు వేఱు దేశములందు వేఱువేఱుగా నృపశాసనము లుండిన పగిది నుండక యా యా దేశముల కన్నిటికిని నేకరాజశాసనమే వ్యవహరింపఁబడునట్లు చేసిరి. అందుచేఁ గొన్ని ప్రదేశములందున్న వారలకు న్యాయమును మఱికొన్నిప్రదేశములం దున్నవారల కన్యాయమును జరుగఁజాలవు. కావుననే యిప్పటి మన భరతఖండమునందలి యే భాగమునకుఁ బోయి చూచినను రాజశాసనములందుఁగాని

రక్షకభటులందుఁగాని దండవిధాయకులందుఁగాని వ్యవహార పద్ధతిలో భేద మొకింతయేనియుఁ గాన్పింపకయే యొక్క తెఱఁగున నుండును. అందువలన భరతఖండమునందలి భిన్న భిన్న దేశములందు జనించినవారైనను నొక్కవిధముగాఁ గాపాడఁబడుచున్నారు. పూర్వముననో మహారాష్ట్రదేశమున జనించినవాఁ డాదేశమునందే సురక్షితుఁడై యుండెడివాఁడు; కాని వాఁడు మఱొకదేశమునకుఁ బోయినప్పుడు వాని జన్మస్థానమునందువలె సురక్షితుఁడు కాకుండెడివాఁడు. అట్టిది యెల్లను బలిష్ఠులును సమర్థులును న్యాయానువర్తను లును నగు బ్రిటిషువారి పాలనమువలనఁ బోయినది. వారు భిన్నభిన్న యభిప్రాయములతోడను భాషలతోడను మతములతోడను కులములతోడను గూడియుండిన యీ దేశము నొక్కవిధముగాఁ బరిపాలించుటయే కాదు; సర్వ ప్రపంచమందలి యైదవభాగమును నేలుచున్నారు. అందులకుఁ గారణము న్యాయానువర్తను లగుచు సకలవిధములను బ్రజ లకు సౌఖ్యమును జేకూర్చెడివార లగుటయే! ప్రస్తుతాంశము నకు వత్తము. పైని చెప్పఁబడిన ట్లిప్పుడు మనము హిందూ దేశమునందలి యేప్రదేశమునకుఁబోయినను జన్మస్థానమునందు వలె సుఖముగా జీవింపఁగలము. అట్లు రక్షకభటుల నేర్పఱుప కున్న నీదేశమున బలవంతులు బలహీనులపైఁబడి వేవిధముల వేధింపక విడిచెడివారలా? గృహస్థులు భార్యాపుత్రాదులతో నొకయూరనే యే పీడయునులేక స్వేచ్ఛగా జీవింపఁగలిగెడి వారలా! తుంటరు లెన్నెన్ని దుండగములుచేయదొరఁకొనెడి

వారలు. శాసనకు లెన్నెన్నియో తెలుగులను గట్టిపాటు లోనవుచున్నను నిప్పటికిని గొన్ని జాతులుండెడి తావులందు జరుగు ఘోర కార్యములు బయటబడుచున్నవా? అట్టిజాతుల నణపలేక చాల రేగినపక్షమునం జెప్పవలసిన దేముండును. ఇంత యేల? "ఒక నెలదనుకను *దొంగతన మొనర్చిన వారలను శిక్షింపము"ని ప్రభుత్వమువారలు ప్రకటించిన పక్షమున నొకరి యింటనైన నొక పూచికపుల్లనైన నుంచురేమో యాలో చింపుడి! అట్టి దుష్కృత్యము లెవ్వియును జరుగకుండుటకై యేలికలు నియమించిన యారక్షకభటాదుల కెంత ద్రవ్యము కావలసియుండునో యోజింపుడి! జీతము లేనిదే లోకమున నెవ్వరును నేపనియును జేయరు కదా! వారలకు మాత్రము భార్యాపుత్రాదు లక్కఱలేదా! వేతనము లేకయే వారల నెట్లు పోషించుకొనంగలుగుదురు. అందుచే మన రక్షణము నకై యేర్పఱచినవారల జీతమునకును మనము పన్ను లీయ వలసియున్నది. పైపెచ్చు మున్నెప్పుడును లేని యుపకార వేతన ముద్యోగముచేసి విశ్రాంతి కైకొనువారల కిచ్చెడి యాచారమును వీరి యేలుబడిలోనే ప్రారంభమయ్యెను.

ఇచ్చవచ్చిన మతము నవలంబించుటకు వీలొనర్చినది యింగ్లీషువారలే! యింగ్లీషువారు రాకముందు మహమ్మదీయ ప్రభువులగు నౌరంగజేబు టిప్పుసుల్తానులోనుగాం గలవారలు

* దీనికి నిదర్శనముగా న్యాగ్రహావేశపరులు మొన్న మొన్న పోలా పురమును నరాజకముగా నొనర్చిన బహుస్వల్ప కాలమునందే యెం తెన్నెన్ని కార్యములు జరిగినవో చూచుకొనవచ్చును.

బలాత్కారముగా లక్షలకొలఁదిని హిందువులను మహమ్మదీయులనుగాఁ గావించియుండిరి. అట్లు హిందువులచే బలవంతముగా నహితకార్యము నాచరింపఁజేయుటయేకాక జాజియా యనెడి పన్నును బ్రతి హిందువు కడనుండియుఁ గైకొనెడి వారలు. ఆ విధముగా బలాత్కరించి మతాంతరులను దమ మతములోనికి లాఁగుకొనిపోవుట యిప్పుడు కలదనఁగలమా! ఇదియు నొక లాభమే యనఁదగును. అనుష్ఠానమువలన నన్యులను బాధింపనట్టిదియు నేవిధమగు నష్టమును గష్టమును నితరులకుఁ గలిగింప నట్టిదియు నగు నేమతమునైనను నిప్పుడు స్వేచ్ఛగా మనము స్వీకరింపవచ్చును. నూతన పరిపాలన విధానమువలన మన సత్యాగ్రహుల కొసఁగిన యధికారమును బట్టి మతవిరుద్ధ కార్యములు తలచూపుచున్నవి ; కాని పాలకులట్టిశాస్త్రవిరుద్ధకార్యములనుమనచేఁజేయింపఁజూడరు. అందులకుఁ దార్కాణముగా మొన్నను బుట్టిన శారదాచట్టము నే చూచుకొనవచ్చును. ఇంకను నా ప్రముఖులు శాస్త్రవిరుద్ధ కార్యముల నెన్నింటినో సాగింపఁ జూచుచున్నారంట. వీనిని బట్టియైనను సత్యాగ్రహులు దేశమున కెంత మేలు చేయఁ గలరో యాలోచించు కొనఁగలము.

బ్రిటిషువారు శాసించునప్పుడే హిందూదేశమునకుఁ గాని యితరదేశములకుఁగాని వార్తలను ధనాదికమును నెట్టి కష్టములునులేకయే తేలికగాఁ బంపుకొనుచున్నారము. పూర్వమీహిందూదేశమునందేయున్న కాశీమొదలగుదూరదేశములందుండెడి వారల కొకయుత్తరము కాని కొంతధనము కాని

పంపనెంచిన పత్రమునఁ బ్రత్యేకముగా నొకసందేశహారునిచేఁ బంపవలసియుండెడిది. అతఁడు మార్గమధ్యమున నెట్టిభీతియును లేక ప్రాణములు నిల్పుకొని నురలి రాఁగలిగిన పత్రమున రాకపోకలకతనికిఁ గొన్ని నెలలు పట్టుటయేకాక విశేషముగా ధనవ్యయమును నగుచుండెడిది. కాబట్టి దీనివలనఁ బూర్వకాలమునం దొక యూరివారి క్షేమసమాచారము రెండవయూరివారికిఁ దెలియుటయే కష్టసాధ్యముగా నుండెననియు గ్రహింపఁగలము. ఇక్కాలము నందొక యరణా వెచ్చించితిమా ముద్రితోత్తరము వచ్చును. దానివలన మన దేశమున నెంత దూరమున నున్నవారలకైనను గొలఁది కాలములో సమాచారము నందింపఁగలము. అట్లే కొంత యుపాయన మిచ్చితిమా ధనాదికమును బంపఁగలము. అట్లుదంతములను దెలిసికొనుటకు జాబులే కాక బహుయోజనముల దూరమునం దుండెడి దేశములందు జనించిన విశేషములను గూడ నొక్క నిమేషములోఁ దెలిసికొనుటకు మనో వేగమునుగూడను గేలికొట్టెడి తంత్రీమార్గములును, తంత్రీరహితమార్గములును గనిపెట్టఁబడియున్నవి. కాన నా విస్యద్వార్తావహముల మూలమున నత్యల్పకాలములోఁ గడు దవ్వునందున్న వారలకైనను వృత్తాంతములనే కాక విత్తమును బంపఁగలము. ఏ ప్రాణికిని గాని యెట్టి బాధయును గల్గింపక సురక్షితముగాఁ బంపెడి యిట్టి విధానములు పూర్వము కలలలోనైనను మన పూర్వులు కనియు వినియు నుందురా!

వివిధకళలయందు మనలను సమర్థులనుగాఁ జేసెడి కళాశాలలను బ్రభవింపఁజేసిన దాంగ్లేయులే యని నిరాఘాటముగాఁ జెప్పవచ్చును. పూర్వము మహావిద్వాంసులగు వారలే యొకకాగితముపైఁ జేవ్రాలు చేయవలసి వచ్చినపుడు కొన్ని కలములు విఱుగవలసి యుండెడివని చెప్పుదురుకదా! ఇప్పుడో సామాన్యుఁడుకూడను జేతఁ గలముపట్టినచో నే విషయమెత్తియైనను జాకచక్యముతో బహుగ్రంథము వ్రాసి తనసామర్థ్యమును జూపుకొనఁగలఁడు. అట్లగుటకుఁ గారణమేమై యుండును! ఎల్లయెడలను బాఠశాలలను నేర్పఱచి పూర్వకాలమునందుఁ గొన్ని జాతులవారలకండని ప్రమానిపండై యున్న విద్యావిత్తమిప్పు డజ్ఞానాంధకారమునఁ జిరకాలమునుండి యుండి యున్నవారల కన్నులు మిఱుమిట్లు కొనునట్లుగా వెద చల్లఁ **బడుట**యే! ఇంటఁ దిని యింటివాసములు లెక్కించుచు మొ... లుపెట్టిరను సామెతగా వా రేర్పఱచిన విద్యాలయములందే బహువిద్యలను గఱచి రాజద్రోహమునకుఁ బాల్పడెడివారలింగ్లీషువారి బుద్ధివైశద్యమును బ్రశంసింపకున్నను నే విధముగానైనను బూర్వసృష్టి యొక యింతయేనియు గలవారలు ప్రశంసింపకమానరు. మనకే కాక మన సంతతివారల కెల్ల నికును సకలవిద్యలను నేర్పించుటకై యేర్పఱచిన కళాశాలాదులకగు ధనము భూస్వాము లొసఁగెడి పన్నుల మూలమునఁగాక మఱెచ్చటినుండి వచ్చును! కాఁబట్టి మనము నేల పన్ను మన రక్షణమునకే కాక క్షేమమునకును బ్రభుత్వమువారి కీయవలసియున్నది. ఆ విషయ మెట్టిదో బాగుగ విమర్శింపుడి.

ఎట్టి వ్యాధినైనను జేతితోఁ దీసివైచినట్లుగాఁ జికిత్స చేయఁగల సమర్థులుండిన చికిత్సాలయముల నేర్పఱచిన దాంగ్లేయులే! బాగుగా యోజింపుఁడి! పూర్వము కేవలము శరీరమునకు భారముగా నేర్పడిన వ్యాధిని గత్తిపట్టి ఖండించి తీసివైచి చూపిన వైద్యుఁడొకఁడైన నున్నట్లుగా మీరు వినియుందురా రేమో. ఇప్పుడుశస్త్రవైద్యములోనగువానినిజక్కఁగాన భ్యసించుటకు వైద్యవిద్యాలయములే కాకజనులధికముగా నుండెడి ప్రతిస్థలమందును ధర్మవైద్యశాలలను స్థాపించివారల కెంతయో మే లొడఁగూర్చుచున్నారు. ఇదియు నదియు ననేల! ధీమంతులగు బ్రిటిషువారలు ప్రకృతియొక్క తత్త్వము నెల్లఁ గనిపెట్టి దానిని గీలుబొమ్మవలె నాడించుచున్నారు; అందు మూలమున జనుల కెన్నియో విధములుగా నుపకృతి కలిగించెడి విధానములను గనిపెట్టి యున్నారు; కనిపెట్టుచున్నారు; కనిపెట్టఁగలరు. అట్లు కాకున్న పక్షమున ధ్వన్యాకర్షణాది యంత్రములు మనము చూడఁగలమా! ఏది! వేఱుమడఁచి చూపుఁడి! స్వరాజ్యము! . స్వరాజ్యమనువార లట్టియంత్రములను గనుఁగొని రేమో! అట్టివానికి వ్యయపఱచెడి ధనము భూస్వామ్ము లోసఁగెడి పన్నులవలన రావలయునుగదా! అందుచేఁ బన్నులీయ రాదనెడి తలంపు ధీమంతులకుఁ గలుగదు.

ఇంగ్లీషువారి పరిపాలనమందే హిందూదేశము పూర్వమునకంటె శతగుణాధికముగాఁ బ్రపంచమున కంతకును సరకులను విక్రయించెడి యంగడివానివంటిదై యున్నది—పూర్వము హిందూదేశమునఁ బంటయే యనుమాట లేని కొన్ని

వస్తువులు సేద్యగాండ్రచేఁ బైరుపెట్టఁబడి విశేషముగా నితర దేశముల కెగుమతి చేయఁ బడుచున్నవి. * అందుచే నూఱురెట్లకంటె నధికముగా వీరిపాలనమునందు హిందూదేశము వారు పరదేశములవారికి సరకులను విక్రయించుచున్నారు. అట్లే పరరాష్ట్రములనుండియు మనకువచ్చెడి విస్మయకర వస్తువులును విశేషముగా నున్నవి. కావునఁ బంటలు పండించెడి రయితులకును వర్తకముచేయు వారలకును నత్యధికలాభము కలుగుచున్నది. ఆ హేతువుచేతనే వర్తకులు కాని కృషీవలులుకాని యిప్పుడు గొప్పగొప్ప హార్మ్యములను గట్టుకొనుటకును ధనాఢ్యులై యుండుటకును దగియున్నారు. పరిపాలకులు హిందూదేశమున వణిక్కర్మ మెన్నెన్ని విధముల వృద్ధి నందింపనిదే పూర్వము నిరుపయోగముగా నుండెడివస్తు సముదాయమునకుఁ గూడను మూల్యాధిక్యము గానిపించునా! పూర్వమే ధనాఢ్యులకడనో యుండెడి వస్తువు లిప్పుడు సామాన్యజనులకడనుగూడఁ గాన్పించుచుండునా !

---

* పూర్వపు మాట యెట్లున్నను గడచినయేఁబదియేండ్లనుండియును హిందూదేశమునుండి యెగుమతిచేయఁబడుచున్న వివిధవస్తువుల మూల్యము డెబ్బది నాలుగు కోట్లరూప్యములనుండి మున్నూట పదునాఱు (316) కోట్ల రూప్యముల దనుకను బెరిగినది. ఆ విధముగనే దిగుమతి యగు వాని యొక్క వెలయును నేఁబదిమూఁడు కోట్లరూప్యములు మొదలుకొని యిన్నూటనలుబది (240) కోట్లరూప్యముల వఱకును నభివృద్ధియైనది. ఇందువలన పూర్వము నిరుపయోగమై పడియుండెడి వస్తుజాలమునకును మూల్యమధికముగా వచ్చుచున్నట్లు భావింపవచ్చునుగదా. అందుచేత హిందూదేశము కొందఱు తలఁచునట్లు క్రమక్రమముగా నిర్భాగ్యమైనదని తలఁపఁగూడునా!

ఇంకం బూర్వము మన భరతఖండమును హిందూప్రభువులుగాని మహమ్మదీయప్రభువులుగాని పరిపాలించినపుడే కేవల పీడాకరములును ననావశ్యములునునైన పనులున్నవా! ఇప్పటి బ్రిటిషుపాలనమున నున్నవాయని విమర్శించిన పక్షమున నవియెల్లను బూర్వపుదొరతనమందే కలవని చెప్పవలసి వచ్చును. అది యెట్లందురా? హిందూప్రభువులును మహమ్మదీయప్రభువులును గూడ నేలపన్ను పండినపంటయొక్క విలువ నుండి మూడవపాలు మొదలుచేసికొని యరపాలు దనుకను జేకొనెడివారలు. ఇప్పటి యింగ్లీషువారి పాలనమందో యా భూమి పన్నా యా మండలములయొక్క మంచిచెడుగులను బట్టి యిరువదియైదవ భాగము మొదలుకొని పంద్రెండవ పాలువఱకును దీసికొనంబడుచున్నది. ఇంక నితరములగు వస్తువులపై విధించిన పన్నుబట్టి చూచినను బ్రపంచమునందలి నాగరికతగల దేశములలో నెల్ల హిందూదేశములోనే పన్నులత్యల్పముగా నున్నవని చెప్పవచ్చును. ఎట్లందురా ఫ్రాన్సుదేశములో నిరువదినాలుగు రెట్లును ఇంగ్లండు దేశములోం బంద్రెండు రెట్లును భరతఖండమునం దున్న దానికంటెను బన్నధికముగా నున్నదని చెప్పుదురు. పూర్వము నేలపన్నొక్కటియే కాదు; రాజకీయ మతావలంబులు కానివారలకును గప్పమును విధించెడివారలు. మహమ్మదీయరాజులు హిందువగు ప్రతిమనుజునకును బన్నుకట్టిరి. ఆచందముగనే హిందూచోళరాజులును జైనులకు బన్ను విధించిరి. అంతియే కాక వారలు మీందుమిక్కిలి వివాహములకు, సంగళ్లకు

వివిధవ్యాపారములకు, జంతువులకు, దేహోపహారములకు, ఫల
ములకు, గ్రామోద్యోగులకు, నాగళ్లకు, మగ్గములకుఁ, కృషి
కులకుఁ, నేతములకుఁ, గొట్టములకు, క్షేత్రములందుఁ బండెడి
సకలధాన్యములకుఁ, దీర్ఘయాత్రాపరులకు, మార్గస్థులకు, వేశ్య
లకు నింక నితరములగు ననేకవస్తువులకును బన్ను విధించిరి.
అట్లన్యాయ్యముగా విధించిన పన్నులవలన వచ్చెడి యాదా
యమును దమ యుపయోగమునకై నిలువచేసికొనెడివారలు;
అట్లు కాదేని యాభరణములకో గజములు మొదలగు జంతు
జాలమును గొనుటకో తామెట్టివీడయును లేకస్వేచ్ఛగానుండు
టకై తలఁచిన తావులందు రమ్యహర్మ్యములను గట్టుకొని
వివిధవిషయోపభోగము ననుభవించుటకో వ్యయపఱచెడి
వారలు. ఇప్పుడు బ్రిటిషుప్రభుత్వమువారు పన్నులమూలమున
వచ్చిన యాదాయమును దమ యుపయోగమునకై యుంచు
కొనక దేశరక్షణమునకై యేర్పఱచిన సైనికులు రక్షకభటులు
లోనగువారల జీతముక్రింద విశేషభాగమును గర్చునని దేశ
మునఁ గ్రమముగుప్రభుత్వము, రక్షణము, సౌఖ్యము, బాటలు,
వైద్యాగారములు, కళాశాలలు మొదలగునవి వృద్ధినొందుట
కును వినియోగింతురు. ఆపన్నైనను పూర్వమునఁ జెల్లించిన
దానికంటె నెంతోతక్కువగాఁ జెల్లించుచు నెంతో యెక్కు
వగాలాభమును బొందుచున్నారము. ఇదియే పూర్వమునకును
నిప్పటికిని గలభేదము. కావునఁ బ్రభుత్వమువారిని విద్వేషిం
చుచుఁ బన్నులీయరాదనెడివారల మాటలను దేవవాక్యము
లుగనమ్మి మనము కష్టములపాలు కాకూడదు. పైని చెప్పినట్లు

బ్రిటిషువా రేర్పఱిచిన క్రమపరిపాలనమే లేకున్న దేశము మహారణ్యాసన్నిభమై చోరులతోడను దుర్మార్గులతోడను నిండి యుండదా! అప్పు డొక మనుజుఁడైనను భయాక్రాంతుఁడు కాక తనపనిని నిశ్చింతుఁడై యుక్తముగాఁ జేసికొనఁ గలుగునా?

మఱియు బ్రిటిషువారి కీభరతఖండము వశము కాక ముందు మహమ్మదీయుల దుష్టపరిపాలనమువలన దేశస్థితి యెంతయో చెడియుండెననియు, నక్బరు మొదలగువారల కొందఱ సత్పరిపాలనమునందుఁదక్క సామాన్యముగా నిరంకుశప్రభువుల దౌర్జన్యమునకు దేశము చిరకాలము లోఁబడి యుండుటవలనఁ బాడిపంటలకు లోపము వాటిల్లుచుఁ దఱచుగాఁ గఱవు వచ్చుచుండెడి దనియు, నాకారణమునఁ జక్కఁగా ధనమునుగాని ప్రాణమునుగాని నిల్పుకొనలేకుండుటయే కాక చిరకాలదాస్యమునకును నిరవగ్రహుల నిరంకుశాధికారములకును లోనై మెలఁగవలసి వచ్చెననియు, నందుచే జనులు మొత్తముమీఁదఁ బురుషస్వాభావికధర్మములనఁదగు ధైర్యసాహసాదులనేకాక ఋజువర్తనాదులను గోల్పోయి సత్యమునువీడి లేక పిఱికితనముతోడను మోసముతోడను జీవింపసాగిరనియు, నీభరతఖండ మిట్టిదురవస్థకుఁ బాలుపడియుండ భాగ్యవశమున జనసుఖాన్వేషణతత్పరులగు బ్రిటిషువారు మనకుఁ బరిపాలకు లగుట సంభవించినది మొదలీదేశమునకు మంచి దినములు రా నారంభించినవనియును దలపోసిపోసి ప్రమోదింపవలసియుండఁగాఁ గృతఘ్నతతోఁ గొందఱు వారలను విద్వేషించుచు హిందూదేశమున వారు

కావించిన ప్రతి కార్యమును స్వలాభమునకే కాని ప్రజోప యోగమునకుఁ గాదనియుఁ బ్రతిదానిపై నన్యాయ్యముగాఁ బన్ను విధించి కోట్లకొలఁదిని ధనమును హిందూ దేశమునుండి కొనిపోవుచున్నారనియు నందురు. అది సత్యమున కెంత దూర మగుమాట :—ఎంతెంతధనమును వెచ్చించినపనిదే నూతన ముగా వారేర్పఱచినవానియం దెల్లను గ్రొత్తక్రొత్తవిశేషము లెప్పటికప్పుడు చూపట్టుచుండునా ? అట్లు కాకపోయినను వైవారలమాటలను మఱొకవిధముగా నైనను సమన్వయించు కొనవచ్చును. భూస్వాములు తమక్షేత్రములను సంవత్సరము పొడవునను బలుపాటుపడి పండించిన పాలేరువానికి వారనిన జీత మేపుట్టెడుగింజలో మొగమునఁ గొట్టుదురు ; కాని పండినపంటలోఁ గొంతభాగమైన నీయుదురా ! అట్లే బ్రిటిషు వారు రాకపూర్వమునసర్వవిధముల ఫలహీనమైయున్న దేశమును గంగా గోదావరి మొదలగు నదులకు బహు వ్యయప్రయాస ములతో నానకట్లు కట్టించియును బహుముఖములఁ బ్రవ హించెడి కాల్వలు త్రవ్వించియును జెఱువులను బాగుపఱ చియును నింకననేకములగు నట్టి ఘనకార్యము లొనర్చియును నీటియాధారములు క్రొత్తవి నిర్మించి సర్వసస్యఫలానుకూల ముగ నొనర్చినపుడు దానిపై వచ్చు నాదాయములో గొంత యైనను గ్రహింపఁదగదే! బాగుగాఁ బర్యాలోచించినపక్షమున వారాధనమును బ్రజాక్షేమమునకునురక్షణమునకు నేవినియో గించుచున్నారు. పూర్వకాలమునం దింగ్లీషువారీదేశమునకుఁ బరిపాలకులు కాకమునుపు జనులు నిరంతరభయాక్రాంతులై

తమ పనులలో నొక్కదానినైనను నిశ్చింతతో యుక్తముగాఁ జేసికొన లేకపోయెడివారలు. అట్టి దుస్థితి నెల్ల నీదేశమునుండి తొలగించుటకై వేలకొలఁది సైనికులను, వేలకొలఁదినావికులను, వేలకొలఁది రక్షకభటులను నియమింపవలసి యుండెను గదా! వారి వేతనాదులకుఁ గాని తుపాకులు లోనగు సాధనములకుఁ గాని ధన మెక్కడనుండి రావలయు ననుకొందము. అట్లే వారీదేశమున నెలకొల్పిన వివిధకళాశాలలకుఁగాని చికిత్సాలయాదులకుఁ గాని ధన మెక్కడనుండి వచ్చునని భావింతము! వారు విశేషముగా నర్థశాస్త్రజ్ఞులును రాజనీతి తంత్రిజ్ఞులును నగుటచే జనులకు సర్వవిధముల సౌఖ్యమును సమకూర్చియు,సమకూర్చినవానియొక్క సంరక్షణమునకై బహుస్వల్పముగాఁ గరమును గైకొనుచును బాలించుచున్నారు. కొంద ఱిసుగడతోఁ ప్రధానోద్యోగములన్నియు వారలవే! వేతనాధిక్యమును వారలదే యని యేమేమో పల్కుదురు. బాగుగా విమర్శించినపక్షమునవారలలో రాజనీతి శాస్త్రజ్ఞులున్నట్లుగా మనలోఁ గలరా! గోక్లేనంటి మహాశయు లెక్కడనో నూటికిని గోటికిని నొకరిద్దఱుందురేమో! అదియొక లెక్కయా! అట్టివారల కున్నతోద్యోగములు లభించుచునే యున్నవి. ఇఁక మనలోని వారలకు సామాన్యముగా రాజ్యవ్యవహారవేతృత్వ మెట్లుండె నందురా! సాధారణమగు గ్రామపరిపాలనా సంఘమునందుఁ గాని తాలూకాబోర్డు నందుఁగాని యంతకంటె నధికమగు మఱియొక దానియందుఁ గాని నిరక్షర కుక్షి యయ్యును, రాజనీతిశాస్త్రవిదూరుఁ డయ్యును నేజాత్యభి

మానాదుల చేతనో యధ్యక్షపదవిని సంపాదించుకొని కుర్చీ పైఁ గూర్చుండు విధమైన నెఱుఁగక మహాసామ్రాజ్యమేదో తానేలుచున్నట్లుగా భావించు కొనుచుఁ గులమువారలకో, నిరంతరము నింద్రుఁడవు నీవు చంద్రుఁడ వీ వనెడి స్తోత్రపాఠము లను వల్లించుకొనుచు దీనులై తనచెంతను బడియుండి తన కేయూడిగమో చేయువారలకో తనవలనఁ గాగలిగిన దేదే నియు నున్నఁ జేయఁజూచును. మహనీయులారా ! అంతియే కాదు. విచారింపఁ బోతిమేని యంతకన్నను వేయిమడుఁగులు విచిత్రములగు విషయములును జూపట్టును. చూడుఁడి! తూసి కలో నొక్కటితులమైనను దక్కువకాని వీసెఁడు ముదుకసాలు గుడ్డను గట్టెడి మూర్తియేనా బాధ్యతాయుత పరిపాలనా విధానమునకుఁ బాత్రుఁ డగువాఁడు! విద్యాబుద్ధు లక్కఱ లేదా? ముందువెనుక లాలోచించు సామర్థ్య ముండఁజనదా! ధీమంతుఁడై యెందైనను పాలన పద్ధతి నలవఱుచు కొన రాదా ! చెంతనుండెడి వ్రాయసకాండ్రు నడపించు దారిని నడచు చుండుటయేనా తగుదునని యధికారభారము తలపైఁ బెట్టుకొని తాండవమాడుట. ఇట్టిదియే కదా మనవారల రాజ్యతంత్రజ్ఞత! ఇఁక నాంగ్లేయులో రాజ్యపరిపాలన శాస్త్రి దులందు ముక్కాకలుదీరి యెన్నియో వేల మైళ్లదూర మునుండి వచ్చి యేవిధముగను దమకుఁ గిట్టని యీ దేశమునం దుండిరి. అపుడు వారల కున్నతోద్యోగములు కాని నేతనాధి క్యము కాని యోగ్యమైనదనియే చెప్పనగును. అనరాదుగాని వారలను జూచి హైందవులు నేర్చుకొనఁదగిన పింకను వేనవే

లున్నవి. అవి యెల్లను ధీమంతులకుఁ దెలియఁదగినవి. ఇఁకఁ బ్రకృతము ననుసరింతము. అట్లు హిందూదేశవాసు లెల్లరును బ్రిటిషుపాలనమువలననే సకలసౌఖ్యములను బడసి పూర్వపుఁ గష్టము లెవ్వియును లేక ప్రభుభక్తితో సుఖముగా జీవించు చుండిరి. అట్టి తరుణమునందు దుర్దైవమువలనఁ బ్రపంచ మహాయుద్ధము సంప్రాప్తమైనది. ఆమహాయుద్ధములో ఫ్రాండర్సులోనుగాఁగల స్థలములందు భారతీయులు ప్రభు భక్తిని జూపి తాము చేసిన రుధిరతర్పణమును గాంచి బాధ్యతా యుతమంత్రులు తమకు శక్యమైనంతవఱకును హిందువులకై ఘనకార్యము లొనర్చిరనియే మన మనుకొనక తప్పదు. నిజ ముగాఁ బరిపాలకులు హిందువులు పరమభక్తితోఁ జూపిన పైవిషయమును గ్రహింపకుండిన పక్షమునఁ బందొమ్మిదివం దల పదునేడవ సంవత్సరమున (1917) హిందూదేశ కార్య దర్శిగా రగు గా॥ మాంటేగుగారు "డిక్లరేషన్ ఆఫ్ పాలసీ" యనెడి వాగ్దాన మీయఁజాలి యుందురా! అందు భారతీ యుల కచిరకాలముననే బాధ్యతాయుత పరిపాలనము యథా క్రమముగా నిచ్చుట కంగీరింపఁబడి యున్నది. దానినిబట్టియే గా॥ మాంటేగుగా రాసంవత్సరముననే భరతఖండమునకు విచ్చేసి ప్రధాననాయకులతోఁ బ్రస్తావించి వారి తలఁపుల నెల్లఁ దెలిసికొనిరి. అంత నా సమయమున రాజప్రతినిధిగా నుండిన చమ్సుఫోర్డు ప్రభువుగారితోడనుగూడఁ గలసి యొక నివేదనము వ్రాసిరి. అందువలననే బ్రిటిషు పార్లమెంటువారు పందొమ్మిదివందల పందొమ్మిదవ (1919) వత్సరమున హిం

దూ దేశ ప్రభుత్వచట్టమును బుట్టించిరి. అది వెనువెంటనే క్రియారూపమును దాల్చునట్లు చేయుటవలననే హిందూ దేశము బాధ్యతాయుత పరిపాలనమునకుఁ బాత్రమైనది. అందుఁ బ్రతిమండలమున నుండువారలకును దమలోనుండి శాసనసభలకుఁ బ్రతినిధులుగ నుండఁదగిన సభ్యుల నెన్నుకొనుట కధికార మీయఁబడి యున్నది. ప్రతిమండలమును గవర్నరుగారి యధికారవర్గము వారిచేతనే కాక శాసనసభాప్రతినిధులనుండి యెన్నుకొనఁబడిన మంత్రివర్గము వారిచేతను బరిపాలింపఁబడుట కధికార మీయఁబడి యున్నది. అంతియే కాదు పురపాలక సంఘములందే కాక జిల్లాబోర్డులందును దాలూకాబోర్డులందును బ్రాతినిధ్యమును బట్టియుఁ బ్రజా సామాన్యప్రభుత్వము నెలకొల్పఁబడుటకును నధికార మీయఁబడి యున్నది. ఇఁక నిట్టిలాభము లెన్నియో భారతవర్షీయులకుఁ గలుగనున్న తఱిని, ఆప్రపంచమహాయుద్ధమువలనఁ గలిగిన మహాదారిద్ర్యముచే భారతీయులును బహువిధంగుల బాధపడుచున్న సమయముననను దౌర్జన్యరాహిత్యసాహాయ్య నిరాకరణ మనెడి పెనుభూత మొకటి పుట్టి దేశము నెంతయో సంక్షోభింపఁ జేసినది. ఇంకను నది దురాగ్రహావేశమున నానావికారవేషములను దాల్చుచు భారతభూరంగమును నెలవుగఁ జేసికొని పిచ్చిపిచ్చి పాటలతోడను మాటలతోడను బ్రజలకు దురాశలను బుట్టించుచును గలుగనుండెడి కలుములను గాకుండఁగఁ జేయుచును, బ్రకృతి విరుద్ధకార్యాచరణమునకై ప్రేరేచి పలు బాములుపడఁ జేయుచును నిచ్చ వచ్చినట్లు నాట్యమాడు

చున్నది. నిజముగాఁ బ్రజలు దానికృత్రిమ నాట్యవిధానమును గనిపెట్టి సందుగొందులను బట్టిపోక రాజమార్గముననే పోఁగలిగిన పక్షమున నేపీడయును లేక యథోచితమగు గమ్యస్థానమును జేరుకుందురు వారేలా! ఆమతావలంబు లెన్నెన్నియో విధములను బరిపాలనమునకు నష్టమును గష్టమును గలిగింపఁ జూతురు; కాని తాము చేయుచుండిన పనియొక్క ఫలితము తుద కెవ్వరనుభవింపవలసి వచ్చునోయని ముందువెనుక లాలోచింపక పట్టరానివారి పాణిపాదమును బట్టుచు "బాబులారా! పాటలు పాడవలదు! నాయనలారా! పన్నులీయరాదు! అయ్యలారా! పరదేశవస్త్రములను బహిష్కరింపవలయును" అని పలు విధములను బలుకసాగిరి. కాని యొకవంక మహాయుద్ధమువలన దినుటకుఁ దిండియును గట్టుటకు గుడ్డయును గఱవై కాఱియ పడుచుండ నొకవంక రాచఱికమువారి ప్రీతికిఁ బాత్రమగుచుండ నడుమను సత్యాగ్రహులు చెఱపనచేటలై వచ్చి ప్రజకు లేనిపోని పిచ్చితలఁపులను బుట్టించుచుఁ బేరునకును బ్రతిష్ఠకును దమ ప్రాగల్భ్యమును జూపి మఱింత పీడించుట న్యాయ్యమగుపనియే! వారు పరిపాలనమున కెంతనష్టమును గష్టమును గలిగించుచున్నామని తలఁచిరో యంతకుఁ బదిరెట్లు ప్రజలకే యానష్టమును గష్టమును గావించిరనియు మనకుఁ దెలిసియే యున్నది. ఎట్లందురా! సకలజనులును బ్రయాణము చేయఁదగిన ధూమశకట శ్రేణులు దీపములులేక సాయంకాలమగునప్పటికి నియమిత స్థానములందు నిలిచి పోవలసివచ్చుటయేకాక రేట్లును హెచ్చినవి కదా! అఖిలజనమునకును గాన

లసిన యుప్పునకు వెల యప్పుడే యధికమైనది కదా! కానిత్రో వచ్చెడి కాగితపుముక్క యొక యరణా యైనది కదా! అట్టి నష్టములకే కాక బహువిధ కష్టములకును గారణమైనది. ఎంతయో కాలమునుండి వచ్చుచున్న వర్ణాశ్రమధర్మము లడుగంటఁ జొచ్చినవికదా! కళ్యాణదాయకమగు విధేయత దూరముగఁ దొలఁగ సాగినదికదా! ఉచ్చనీచవిశేషములు సమత్వమును వహించినవికదా! తల్లిదండ్రుల మాటలు తనయులు పెడచెవిని బెట్టసాగిరికదా! భార్య భర్తమాట విననొల్లకుండెనుగదా! చదువుసంధ్యలు దేశమునుండి సాగిపోవుచున్నవి కదా! దురాచారములు సదాచారముల నణఁగఁద్రొక్కుచున్నవికదా! దుర్జనులను సుజనులనుగాను నగపడఁజేసినది కదా! నిరక్షరకుక్షుల నధికారపదవుల కధ్యక్షులనుగాఁ జేయుచున్నది కదా! ఇంకనిట్టి వెన్నియోకలవు. అవియెల్ల సుజనుల యనుభవములో నున్నవి. మఱియు వీరలు తమ సత్యాగ్రహము మూలముననే సంభవించిన పంజాబుహత్యల వంటివానిని కిలాఫతునమస్యవంటి వానిని సంస్కారవిధానములను బురస్కరించుకొనుచు దొరతనమును లోఁగఁదీయవలయుననెడి తలఁపుతో దమ ప్రౌఢతనమునుజూపి "ఇదిగో స్వరాజ్యము! అదిగో స్వరాజ్యము! అదిమనకుఁ గరతలామలకమైనది! ఇఁక మనమే ప్రభువులము" అని కల్లబొల్లిగాఁ బల్కి రిత్తకోర్కెలను బుట్టించి మోసగించి లక్షలకొలఁది ధనమును ప్రజలకడనుండి కొనిపోయిరి; పోవుచున్నారు; పోనున్నారు. కాని తుదకు వారు తొలుత భావించినట్లుగాఁ బ్రభుత్వము నణఁగఁద్రొక్కి కాని

స్వాధీనము చేసికొనను కాని చూపఁజాలక పోయినది. అది యట్లు గుటు సహజమే! పదునాల్గవ పదునైదవ శతాబ్దులలో నైరోపా యందుఁ బుట్టిన యంతఃకలహములకుఁ గాని స్వాతంత్ర్యము నకై యమెరికాలోఁ జరిగిన పోరాటములకుఁ గాని, కొలఁది కాలము క్రిందటనే హంగేరియా, ఇటలీ, కొరియా మొదలగు దేశములందుఁ గలిగిన గగ్గోలులకుఁగాని ఫలమేమైనను గాన్పిం చియుండెనా! ఆ తెలఁగెల్లను ధీమంతులు తెలిసికొందురు. గాక! ఇంతయేల? రష్యాదేశపు రాజకీయసంక్షోభమే హిం దూదేశమందలి సంక్షోభమునకు దారిచూపినదని చెప్పుట కలదు కదా! ఆ రష్యాదేశమందలి జనులు వివిధకష్టములకు లోనై కుంది కుంది మృతినందిరను మాట మనకెల్లరకును దెలి సియేయున్నది. అందులకుఁ గారణమేమైయుండె ననుకొను చున్నారు. అందుఁ గ్రమపరిపాలనము రూపుమాయుట యొక కారణము; అది జనసామాన్య పాలకవర్ణములతో నిండియుం డుట మఱియొక కారణము. అంతకన్న నధిక కారణము లేమి కావలయును? ఇప్పటికి మాత్రము వారికష్టములు గడచిన నవా! బాగుగా నాలోచించిన పక్షమునఁ బ్రభుత్వము వారు ప్రాతినిధ్యప్రభుత్వమును బట్టియే యే దేశమునకు నైనను స్వపరిపాలన మొసఁగినట్లు చరిత్రములందుఁ గాన్పించును; గాని సకలపీడాకరములగు సాహాయ్యనిరాకరణాదులచే స్వరా జ్యము చేకూరినట్లు గాన్పింపదు సరియగదా; జుట్టు చేత నున్నపుడు పిల్లి గంతులిడెనన్న సామెతవలెఁ జూపట్టును. భాషాభాగాది విభేదములతోడను వివిధవర్ణములతోడను నానా

జాతీయ మతములతోడను గూడిన భారతభూమి చార్త్రపూని కపు బాధ్యతాయుత పరిపాలనమునకే పాత్రీభూతము శాసనాధి నుండినపుడు సత్యాగ్రహులు లహింసతోడ స్వరాజ్యము నభిలషించి తొల్లిటి దుఃఖవార్తల నెల్ల మరల ప్రజానుభవము నకుఁ దెజూతురు గాఁబోలును. మనదేశమునం దాంగ్లీషువారి ప్రభుత్వము నెలవుకొనక మునుపు నిరంకుశాధికారులైన కొందఱు దుష్టప్రభువులు సాగించిన దౌర్జన్యమునుగాని క్రూరయా మునుగాని తలఁచుకొని నపుడెల్ల దేహము కంపమందుచుం డునే. ఆకాలమున ధనమునకుఁగాని మానప్రాణములకుఁ గాని రక్షణ మెక్కడిది! న్యాయమెల్లను ధనమునే యాశ్రయించి యుండుటవలన నది కూటిపేదలకుఁ గలలోని వార్తయై యుం డెను. ఇప్పుడును నట్లయిన పక్షమునఁ బ్రజల మదృష్టమని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. మఱియు నా సహాయ్యనిరాక ణవాదు లెంతసేపును లేనిపోని దోషములను బ్రిటిషు పరిపా లనముపై నారోపించుటయే యన్నిటికంటెను ముఖ్యమగు కార్యముగఁ జూచుచుఁ బ్రభుశాసన నిరసనమే వారి యుద్య మశరీరమునకుఁ బ్రాణమని భావింతురు. దానినిబట్టి పరిపాల కులును సమ న్యాయానుకూల పరిపాలన విధానమునకుఁ జేటు వాటిల్లకుండుటకై కట్టుదిట్టములు చేయుట విధి యని చూడ రా! ఆ నిరాకరణవాదులు శాసన నిరసనాదులను దేశము నందు బొమ్మజెముడువలె వ్యాపింపఁజేయఁ జూచెడి తఱిని ప్రభుత్వమువారలు ముఖ్యనాయకులమని తలయెత్తి తిరుగు వారలనుబట్టి కారాగారముల కనిపిరి. ఇదియే న్యాయ

రహితమగు పూర్వపుం బ్రభుత్వమువంటిదే యైన పక్షమున వారలస్థితి యెట్లుండెడిదియో కదా! దయామయమగు పరిపాలన మగుటచేత నేకదా బంధనాలయముల కనుపఁబడినవారలు మనుగుడుపుల కత్తవారింటికిఁ బోయిన యల్లునివలెఁ బోయి వచ్చుచున్నారు. అట్లుకాక యీ బంధనాలయములు పూర్వమువలె వివిధ కష్టములకు మూలములై యున్న పక్షమున నా స్థానములకుఁ బోవసాహసింతురా! కార్యసాధనమునకై ప్రభువులు చూపవలసిన సామదాన భేదదండోపాయములనెడి చతురోపాయములలోఁ జతుర్థోపాయమును జూపినప్పుడు పరిపాలనమును స్వీకరింపఁగలరే! ఇతరు లేవిధముగఁ జెడినను సరియే పడినను సరియే యనుకొనుచు నాత్మార్థమాత్రము బహుదరిద్రవ్యమును గూడఁ బెట్టుకొనిన పరవాదులు దేశోద్ధరణమునకై కంకణము గట్టుకొనిన వారలైనట్లుగాఁ గాన్పించుచు రాజకీయ విషయమునఁ బాపపుణ్యము లెఱుఁగని ప్రజలకేమేమియో బోధించి వారలను బలుబాధలు పడఁజేయుచున్నారు. ఆ బోధనములందేమి మాయకలదో కాని కొందఱు చూపిన చేపలపగిది వారి గాలములకుఁ దగులుపడుచున్నారు. మఱికొందఱు భగభగమండెడి యగ్నికి శలభములు బలిగిడినట్లు బలిపడుచున్నారు. కొందఱు జలములని భ్రమరించి యెండమావులకై ప్రధావించెడి మృగముల లాగునఁ బ్రధావించుచున్నారు. హతవిధివలన ముందువెనుక లాలోచింపకున్నారు. పతిసుతులకు దూరమగుచున్నారు. రాఁబోవువ్యథలను గణింపకున్నారు. ఆంగ్లేయులపైఁగల యీసుచే మహాపురు

షులు తమ్ముఁ గలపింపఁ జేసిన దెల్లను సాధ్యమే యనుకొనుచున్నారు. వీరి కేమి? పాపము! కళాశాలలందుఁ జదువుకొని విద్యాబుద్ధులను గడించి బాగుపడవలసిన విద్యార్థులెందఱో వారిమాటలకుఁ జెవియొగ్గి కళాశాలలను వీడి శిక్షార్హులగుటయే కాక విద్యాభివృద్ధికై తను చిన్నతనమునుండియుఁ దల్లిదండ్రులు లోనగువారలు పడిన వ్యయప్రయాసములను వ్యర్థముగావించిరి. అంతియే కాదు దినమంతయు ద్రవ్యమును గడించుకొని యాలుబిడ్డలతోఁగూడి స్వేచ్ఛగా జీవింపవలసిన కూలివాండ్రును వారిమాటలకులోనై యంత్రశాలయాదులను వదలి శిక్షలకుఁ బాత్రులైరి. ఇంక నట్లే యుద్యోగములచే సౌఖ్యముగా జీవించెడి*గ్రామాధికారులు లోనుగాఁగల వారలును

---

*గ్రామాధికారులు

గ్రామాధికారులనఁగా గ్రామములను ప్రభుశాసనానుకూలముగఁ బరిపాలించుటకు నియమింపఁబడిన విచక్షణులు. బాగుగా నాలోచించినచో మేని వీరలు తాలూకా కధికారియగు తహసీల్దారుకంటెను, జిల్లా కధికారియగు కలెక్టరుకంటెను నింక నితర విషయములందు నియమింపఁబడిన పెద్దపెద్ద యధికారులకంటెను విశేషాధికారములు గలవారలు. ఎట్లంటిరా! గ్రామములో రెవిన్యూవారు వారే! పోలీసువారు వారే! ఎక్సైజువారు వారే! వీరువారన నేల! ప్రభుత్వమువారిచే నియోగింపఁబడిన ప్రభుత్వమునకు మూలభూతులగువారలు వారే. దీనినిబట్టి ప్రభుత్వమునకు సంబంధించిన ప్రతి యుద్యోగముతోడను గూడియున్న పురుషశ్రేష్ఠులు వారే యని చెప్పుటకు సందియమున్నదా! ప్రప్రథమమున నేవిషయమునందైనను వారు మొలపించిన మొలకలనుబట్టియే యీశాఖోపశాఖలయందుఁ గ్రమక్రమముగా మహావృక్షములను గావింతురు. ఆగ్రామాధ

బూర్వమునుండియుఁ దమ వంశమునందుండెడి యధికారములను గోల్పోయిరి. వీరు వారననేల? వారి మాటలే మాటలని విశ్వసించినవారలంతయును సకలకార్యములను జెడఁగొట్టుకొనిరి. కొందఱు దుండగములొనర్చి కఠినశాసనమున కాశ్రయులైరి. అందుచేతనే విద్యాలయములు క్షీణించినవి; వాణిజ్యసంపద సన్నగిల్లినది. అట్టివి సంభవించునెడల దేశమెన్నియో విధముల క్షీణింప మొదలుపెట్టెననియే చెప్పవచ్చును. ఇవియే సాహాయ్యనిరాకరణాదులవలన దేశమునకుఁ గలిగెడిలాభములు. పదునెనిమిదివందల యేఁబదియేడవ (1857) సంవత్సరమునఁ బుట్టినదానికంటెను సాహాయ్యనిరాకరణము జనులను మహాకష్టములపాలు చేసినదనియే చెప్పవచ్చును. అంతకన్న నిప్పుడు సత్యాగ్రహావిర్భావము సర్వవిధములను సకలజనుల నావేశించి పిచ్చిపిచ్చిపనులను జేయించుచు మితిమీఱిన దుఃఖములకుఁ బాల్పడఁ జేయుచున్నది. ప్రజ లందఱు సత్యాసత్యములను, సాధ్యాసాధ్యములను నరయకున్నారు. సద్బుద్ధితో విచారించిన మీకీవిషయము తేటపడును. బాగుగ నాలోచింపుఁడి!

---

కరణములకు జీతములు పెద్దవారల కిచ్చెడి జీతములనుబట్టి చూచినపు డత్యల్పముగాఁ గానుపించినను గ్రామములందు ననేకవిధములగు సంపాదనమునకుఁ గాని పలుకుబడికిఁగాని వీరలకు మితి లేని వారలైరి. పైని చెప్పఁబడినట్లు రాజకీయమగు ప్రజాధికారమును గ్రామపరిపాలనములందావేశించియుండెఁ బ్రభుత్వశక్తి నిజూపి కారణములేక కలిగిన సత్యాగ్రహమును శాంతింపఁజేయుటకు సరిమి వారలనుండఁగా "మాకుద్యోగము లక్కఱలేదు! మాకుద్యోగము లక్కఱలేదు"ను కొనుట యెంత యనాలోచితకార్యమో యాలోచింపుఁడి!

ఇఁక వశుకునూలుతో నేసిన ముదుకగుడ్డలను గట్టినపక్షమున స్వరాజ్యము ప్రాప్తించునని వేవిధముల ఘోషించువారల ఘోషణ మెంతవఱకు సత్యమైనదో విమర్శించుకొందము. అంత నావస్త్రధారణమువలన స్వరాజ్యలాభము కలుగకపై పెచ్చు విశేషముగా ద్రవ్యనష్టమును గలుగునని తెలియవచ్చును. ఆముదుకగుడ్డలను గట్టుటచేతనే స్వరాజ్యము వచ్చునని రెండుమూఁడు కారణములను జూపుదురు. అవి యెవ్వియందురా! చిత్రవిచిత్ర వస్త్రము లింగ్లాండులోనున్న లాంకుషైరునందు నేయఁబడుచున్నవనియు, నా వస్త్రములను భారతీయులు కొనకుండిన పక్షమున వారల యపరిమితాదాయమున కెంతయో నష్టము కలుగుననియు, దానినిబట్టి కర్మాగారాధిపులు లోనగువార లొక్కుపెట్టునఁ బరిపాలకులపైఁ బడి భరతఖండమునకు స్వరాజ్య మిప్పింతురనియుఁ బ్రతివత్సరమును భరతభూమినుండి యావస్త్రములకై యఱువదికోట్ల రూప్యములు తెక్కలుగట్టుకొని యింగ్లాండున కెగిరి పోవుచున్నవనియు, నాపరదేశవస్త్రములను బహిష్కరించి తమదేశముననున్నవారల చేతులతోడనే వడికిన ముదుకనూలుగుడ్డలను నందఱు గట్టుకొనినపక్షమున నారూప్యములన్నియు భరతఖండమునందే పాతుకొనియుండుననియును జెప్పుచున్నారు. ఈయుపదేశము లెంతవఱకు సత్యములైనవియో చూతము! లాంకుషైరనునది యింగ్లాండులో నత్యల్పభాగమేకాని యత్యధికభాగముకాదు. వారు చెప్పునట్లుగాఁ దమకుఁగలుగునష్టమునుబట్టిలాంకుషైరువారొకవేళ స్వరాజ్యమిప్పింపఁజూచినను, లాం

కు హైనువంటి మిగిలినభాగములన్నియునునాయభిప్రాయముతో
డనే యుండునా! ఉండవు! పోనిండు! దీని కేమి! కామన్సుసభలో
నైనను సత్యాగ్రహులు దేశించునట్లులాంకషైరునకుఁ బ్రాతిని
ధ్యాధిక్యమైననుండియున్నదాయని ప్రశ్నించుకొంటిమా! లేదు
లేదని యే ప్రత్యుత్తరము వచ్చును. అప్పుడు వారలతలఁపులకును
వీరల తలఁపులకును భేదము శబ్దమాత్రమే యగును. మఱియొక
మాట! హిందూదేశము బ్రిటిషుపరిపాలనమునం దున్నప్పుడే
తమవస్త్రములకు బహిష్కారములు జరుగుచున్నవని లాం
కషైరువారెఱుఁగుదురు. అట్టివిషయములను బాగుగా నెఱిఁగి
యుండిన బుద్ధిమంతులగువారలు హిందూదేశమునకు స్వరా
జ్యము చేకూరినచో నందలివిపణులందుఁ దమవస్త్రములు నిర
భ్యంతరముగా నెట్టిసంస్కారములును లేక విక్రయింపఁబడునని
యూహింపఁగలరా? హిందూదేశమునకు స్వరాజ్యాభికాంక్ష
హెచ్చు పెరిఁగిన కొలఁదిని నన్యదేశీయ వస్త్రబహిష్కారము
మఱింత యధికమగుచునే యుండునని వారికిఁ దెలియదు
కాఁబోలును. ఎంత వెఱ్ఱితనము! ప్రకృతమునుబట్టి యిందుఁగొంత
కలవరము కలిగినదనుకొందము. దానిని రూపుమాపుటకై పాల
కులు తగు యత్నము చేసిరి; చేయఁగలరు; లాంకషైరునందు
దూది స్థితికను పెంపుచెందుటకును దానిపై జపానులోనగు
వానికిఁ గలుగు స్పర్ధను నశమాన్పుటకును సత్పరిపాలనవిధాయు
గు బ్రిటిషువారుచేసిన ప్రయత్నములు సాగుచున్నవి. సర్వ
విధముల సామర్థ్యము గల వారలు చేయు పనుల కాటంక
ముండునా? దీనిని బట్టి స్వరాజ్యప్రాప్తి పూజ్యమైనదని నుల

భముగాఁ దెలిసికొనఁగలము! పోనిండు! ఈమాటల కేమి! విదేశవస్త్రముల వెలకన్నను స్వదేశవస్త్రముల మూల్యమైన ను దక్కువగానున్నదాయని యనుకొందమా! లేదు! నాల్గురె ట్లధికముగానే యున్నది. కానితో వచ్చెడి వస్తువు నైదు కానులతోఁ గొనుట ప్రజకు ద్రవ్యనష్టముకాదే! అట్లు వెట్టి లగుచుఁ బ్రతివస్తువును గొనుచుండిన దేశము బీదతనమును వహించుట కీకమియందు లోపముండదు. మఱియు నంప లను నూలు వడుకవలయును ఖద్దరు కట్టవలయు ననియును బ్రబోధింతురు. అది సాధ్యమగునదియేనా! ప్రతివాఁడును నూలు వడుకఁజాలునా! సంరంభ మధికముగా నుండినప్పుడే నూర్గుర కేమైదాఱుగురో వడుకఁజూతురు. వారైనను నాసత్యాగ్రహా పిశాచ మావేశించి యున్నంతకాలమే యట్లు చేయఁజూతురు గాని పిదప దానివార్త యైనను దలపెట్టఁబోరు. ఇంతయేల! పందొమ్మిదివందల నిరువదియొకండవ వత్సరమునఁ బ్రభవించిన సాహాయ్యనిరాకరణముతో దేశము తవులునడిపోవునప్పు డుద్భవమైన రాట్నముల గతి యేమైనదో విచారింపుడి! ఆగతియే యిప్పటివానికి మాత్ర మేల పట్టకుండును? ఆవృత్తి వలననే కాని జీవితమును గడుపఁజాలమని ప్రజ లనుకొనరు గదా! భూసంపత్తిగల వారలుకాని ధనసంపత్తుగల వారలు కాని కుడిచి కూర్చుండి పనిపాటలు లేక యావేశముచేఁ గొంతకాల మట్లు రాట్నములను ద్రిప్ప మొదలుపెట్టినను దీర్ఘకాలమట్లు చేయఁజూడరు. ఇది యెట్టిమాటయో యథా క్రమముగాఁ దెలియును. పూర్వమునుండియు ముదుకగుడ్డలను

గట్టు నలవాటు పడియుండిన కొన్ని ప్రదేశముల వారలీ నూతన బోధకులకుఁ బరమగురువు లవుదురు గదా! వారు స్వరాజ్యసంపాదన మొనర్చిరా! అచ్చటఁ బండెడి పంటల వలన వచ్చు రాబడి తమపొట్టకే చాలకుండుటచేతను, గొనుటకు ద్రవ్యము లేకుండుటవలనను వారల కట్లు చేయు నలవాటు కలదు. ఇది యెట్టిదో పలనాడు మొదలగు స్థానములకుఁ బోయి చూచినఁ దెలియఁగలదు. వేదములకు వ్యాఖ్యానము లనఁదగు కాణ్వశతపథాది బ్రాహ్మణములందు *నూలు తీయుట కాని యున్నితో నల్లుటకాని స్త్రీల పనియని యున్నది. అట్లు చెప్పుటకుఁ గారణ మీక్రింది విధముగా నుండవచ్చును. ఎల్లప్పుడు నింటనుండిన పురుషులును నిల్లువదలి పోవు స్త్రీలును జెడుదురనెడి సామెత యున్నది; కావున నిరుగు పొరుగిండ్లకుఁ బోయి యకారణకలహములను గల్పించుకొన కుండులాగున నింటనే యుండి గృహకృత్యములను దీర్చుకొనుచుఁ దీఱికయైనపు డావని చేయునట్లు విధించి యుందురు; కావున యది పురుషకృత్యమనలేము. నాస్తికమతములందది పురుషకృత్యముగ సిద్ధపఱబడి యున్నదేమో! అది నాస్తికు లనుకొని మురియఁదగినది! కాని యాస్తికులనుకొని మురియఁదగినది కాదు.

---

* ఊర్ణాసూత్రేణ బ్రాహ్మణాః। పద్మాదే ఏతత్ స్త్రీణాం కర్మ యదూర్ణాసూత్రం కర్మ వా ఇంద్రియం వీర్యం తదేత ముత్పన్నగ్ స్త్రీషు తద్యదేవైతదింద్రియం వీర్యముత్పన్నగ్ స్త్రీషు తదేవావరుంధే

(కాణ్వ శతపథము. ౧౪ కాండ ౪ అధ్యా ౨ బ్రా ౧ కం)

ఇంకను నాధునికపు సత్యాగ్రహమునుగూర్చి యొకటి రెండు మాటలు చెప్పి యీగ్రంథమును ముగించెదను. ఇట్టి వ్రాతలు కొందఱకు రుచింపకపోవుటవలన నావంటివారిని జూచ్చి యిట్టుల బలుకులు పలుక మొదలిడుదురనియు నేనెఱుంగుదును. ఇట్టి దూషణము కృతజ్ఞులకు లెక్కగాదు. లోకములోని ప్రతిపదార్థమును గుణదోషములతోఁ గూడియుండుట సాజము. గుణములనే చూచువారలకు దోషములును దోషములనే చూచువారలకు గుణములును గాన్పింపవనుమాటయు నిశ్చయమే. అందుచే నావంటివారలను దేశద్రోహులని వ్యర్థముగా నిందించి నప్పుడు రాజద్రోహులను నిబద్ధిమాట వారిపై మాత్రము పడకుండునా! అందును నకారణజనితమగు దేశోపప్లవశాంతికై కడఁగుట దేశభక్తి చూపుటయేయగును; కాని దేశద్రోహమని యెంతమాత్రమనిపించుకొనదు; అందుచే దేశభక్తియును రాజభక్తియును మెండుగ గలవారమే యగుదుమనుట కావంతయును సందియము లేదు. మఱియొకమాట. ఆగ్రహావేశములు మహాక్రూరకార్యములుచేయుచున్నను, సత్యాగ్రహపూర్వకముగ సాహ సత్కార్యములను జేయుటకును వెలపడుదురనియును మన మెల్లర మెఱిఁగిన మాటయేకదా! అందును సత్యమైన యాగ్రహము కలవారలైనప్పుడు మహాక్రూరకార్యములను జేయ వెనుదీయ రనియే భావింపవలయును. ఆగ్రహ మెంతైనను సత్యాసత్యముల నన్వేషించునా! ఆ పదమున కదె యర్థము కాకున్నను బెంకెతనమను నర్థమైన నగును. అప్పుడది మూర్ఖత్వగుణమగుఁగదా! అందుచే నది హిందూదేశము నెంత దుఃఖభాజ

నముగ నొసగ్చినదో యొనర్చుచున్నదో విమర్శకులకుఁ దెలి యును. మహాత్మాగాంధీ! ఇది గానుగా నిన్నటికి లవణసత్యాగ్రహమై పోయినది కదా! ఇంకా విషయ మెత్తికొంత పరిశీలింపవలెనని యున్నది. ఈకాలమునఁ గొందఱు మహాపురుషులు బయలుదేరి తమ సత్యాగ్రహము సాగుదారి కానక "సాధారణముగా సకలపదార్థములం దుప్పు గలసి సర్వజనులచే భక్షింపఁబడుచున్నది కదా! అట్టి తమ యాగ్రహముందుతోఁ గల్సిన పక్షమునఁ గడలుకొని నిఖిలజనులకుఁ సమయాశయము కేటపడును" అని కాఁబోలును దానిని దుదకు లవణసత్యాగ్రహముగా మార్చుకొనిరి. కాకున్న లవణనామమును గాత్షింపనేల! వారు పామరజనులకుఁ గూడను బ్రిభుత్వముపై ద్వేషము పుట్టించెడి తలఁపుతోఁ బరపాలకు లన్యాయ్యముగను నధికముగను నుప్పుపైఁ బన్ను విధించిరని దెసలు మాఱుమోఁగ్రియ గొంతెత్తి యూహారను బజగడములందు మహోపన్యాసము లీయమొదలుపెట్టిరి. మున్ముందుగా నెవరు చెప్పెడి దానియందేమాత్రము యాథార్థ్యమున్నదని విచారింపకపోవుటయుఁ గూడ జనసామాన్యమునకును నైజమైయున్నది. అట్లుగాక ధీమంతులగు మీరలు వారినోటనుండివచ్చెడి ప్రతి వాక్యమును శ్రద్ధతో వినఁచింపుడి! అంత వారిపలుకులందావంతయోసియు సత్య మునుమాట లే దనియును, వార ట్లసత్య విషయములను గల్పించుకొని జనుల నానావిధములఁ బ్రతారించుచున్నారనియును విశదమగును. ఒకవేళ వారనినట్లుప్పు పన్నును

దీసివైచి దానిని బంధించుటలోఁ గాని పంపకము చేయుటలోఁ గాని పాలకులు కలుగఁజేసికొనకుండిన పక్షమున నేమగునో కొంచెముగా నాలోచింపుఁడి! ఆలోచనమునకు కేమున్నది? ఇప్పుడు ధాన్యాదులు కాని వస్త్రాదులుకాని నూనెనేయి మొదలగునవి కాని వర్తకు లన్యాయ్యమనియు నత్యధికమనియుఁ జూడక వారివారి యిష్టమువచ్చిన మూల్యమున కమ్ముచున్నారా? లేదా? అమ్ముచున్నారనియే చెప్పక తప్పదు. అట్లు కాకుండిన పక్షమునఁ బూర్వము మన యెఱుకనే మూఁడు రూపాయ లమ్మెడి ధాన్యపుమూట (బస్తా) యిప్పు డేడెనిమిది రూపాయ లెట్లయినది! అట్లే పాలకు లుప్పు విషయమై సంబంధము కలుగఁ జేసికొనకుండిన పక్షమున వర్తకులు నిరాటంకముగా వారి యిచ్చవచ్చిన ట్లధిక మూల్యమున కమ్మక మానెడి వారలా! అప్పుడు ధాన్యాదికమువలె నుప్పు వెలయును హెచ్చుని తెలియవచ్చెడిని. ప్రజాప్రమోదాన్వేషణాసక్తులగు బ్రిటీషు వారలు వర్తకులిష్టానుసారముగా దర పెంచకుండులాగునఁ గట్టడచేసి స్వల్పముగాఁ గరమును గైకొనుచున్నారు. అన్యాయ్యముగను నధికముగను దానిపైఁ బన్ను విధించుటలేదు. అయినను సామాన్యముగా నొక మనుజుఁడు వత్సరమున కెంతయుప్పు తినఁగలఁడని యూహింతురు! ఎంత తినువాఁడైనను సంవత్సరమునకై దుసేరులకన్న నధికముగాఁ దినఁజాలఁడు. దానిపైఁ బన్నెంతకలదు? మూఁడణాలుమాత్రమే కలదు. అట్లు లెక్కచూచుకొనిన నెల కొక కాని యగును. కాఁబట్టి

వ్యాపారము చేయువారలు ధాన్యాదులకునవలె దగ పెంచకుండ నియమించి సకల జనులకు దొరకునట్లు చేసెడి పరిపాలకుల కొక్క మనుజుఁడు నెల కొక కాని చెప్పున నీయరాదా! ఆ పన్నెనను బూర్వమునుండియు వచ్చుచున్న దేకాని క్రొత్తగా బ్రిటిషువారు కల్పించినది కాదు. వెల సులభము ఫల మధిక మను విధముగా భారతఖండమునఁగల ముప్పది రెండుకోట్ల ప్రజలకడనుండియు నా విధముగా రమారమి యేడుకోట్లరూప్యములు వచ్చుచున్నవి. అది యే వర్తకులకైనచో డెబ్బదికోట్ల రూప్యములు రాకపోయెడినా! అవగిది వణిజులు ప్రతివస్తువుపై నెంతయోలాభమును దీసికొనని దే కూర్చుండియే కుబేరులగు చున్నారా! అట్టి వేవియును లేక సత్పరిపాలనము చక్కఁగా సాగుటకై ప్రతిమనుజుఁడును లవణమునకై నెల కొక కాని యిచ్చుట యన్యాయ్యమనియు నత్యధికమనియు సుజను లను కొనరు. ఇది యెట్టిదని మీరే పర్యాలోచింపుఁడి! మఱియు నియ్యదనునఁ బల్కిగనుండెడి స్వరాజ్యపదార్థము లవణత్వ మొకింత యేనియు నెఱుఁగని పురుషుల పాలఁబడియుండిన పక్షమున నిక్కముగా నీయి కాఱఁబెట్టుదురని కాఁబోలును బూర్వమునుండియు నిలు వెడలక యింటనే యుండి యేదేశము వారలును గడింపఁజాలని పరమపవిత్రతను సంపాదించెడు స్త్రీల నిప్పుడు దుస్స్వభావానుకూలమగు కార్యములను జేయఁబ్రోత్స హించుచున్నది. అది సనాతనధర్మమునకు విరుద్ధముగాదే! కులపాలికల కది కూడినపనిగదా! అది విశేషమే కానచ్చును!

పాకక్రియాప్రావీణ్యమును బట్టి లవణశక్తి బాగుగా నెఱిఁగిన
మహిళామణులిఁక నీరుగా అక్కడ దాని నెండఁబెట్టుదురుగాక!
తండ్రికిఁ బెండ్లియగుచున్న దనెడి సంతసమే కాని తల్లికి సవతి
వచ్చునని కాంచనట్లుగా నాంబోతుకష్టములను గనిపెట్టకు
న్నారు. అంతియే కాదు. పాలలోఁ గలపి విషము పెట్టినట్లుగా
నొక మిషచేఁ దననాస్తికమతమును వ్యాపింపఁజేసి పరమ పవిత్ర
మైన యాస్తికమతముయొక్క పేరైనను లేకుండఁ జేయనెంచిన
నాస్తికుని తలంపునైనను దలపెట్టకున్నారు. *ఇంతయేల ?
సకలసౌఖ్యములతో స్వేచ్ఛగా నుండవలసిన వారలు పేరాసలు
పెట్టుకొని లేనిపోనికష్టములను బైనివేసికొని దుఃఖముల పాల
గుచున్నారు; కాని మనకిప్పుడున్న స్వాతంత్ర్యములను బరిగణింప
కున్నారు. జర్మనీ, ఫ్రాన్సు, ఆస్ట్రియా, ఇటలీ మొదలగు దేశము
లందలి నాగరకతగల పాశ్చాత్యులకంటెను బ్రిటిషుపాలనములో
నున్న భారతీయులకుఁగల స్వాతంత్ర్య మత్యధికముగా నున్నది.
ప్రపంచమునఁ గల ప్రజాప్రతినిధి సంఘములకెల్లను దల్లియనఁ
దగు బ్రిటిషుప్రభుత్వము మన కట్టి స్వాతంత్ర్యములను బ్రసా

---

*,, భారతీయు లిప్పుడు లగుప్త ప్రయోగమునఁగాని సామదానభేద
ములతో గుంపుడుకు పనులను చేరఁగొనుట మానరనెడి సదుద్దేశ్యమును
నొకదానిని భారతులను బరమాదరముతోఁ జూచెడి యాంగ్లేయులకు మన
సత్యాగ్రహులు గలిగించిరి. కుశాగ్రబుద్ధులతోడను విక్రమోపేతులతోడను
గూడిన భారతమున కిట్టిపాటులనే కలిగించుటకన్న వారు చేయు ఘన
కార్యము లుండవు.''

దించినందుల కెంతయో సంతసించుచుఁ గృతజ్ఞతను జూపవల సియుండఁగా సత్యాగ్రహముతో నుండుట కృతఘ్నత కాదే! ఇప్పుడు క్రమాధికారప్రియులై దేశక్షేమమును గోరువారలకు సుఖముండునుగాని తదన్యులకు సుఖముండదు. అందుచే మన మెల్లరమును బ్రిటిషువారి క్రమాధికారమును శిరసావహించు నది; అట్లొనర్చుటయే కాదు ప్రతిగ్రామమునందును గూర్పక పోయినను దునకుఁ బ్రతి తాలూకాయందును బ్రతి మండల మందును సహకారిణీ మహాజన సభలనుఁగూర్చి మన భారతీయ సహోదరులు కొందఱు సత్యాగ్రహావేశులై పౌర్వాపర్యమును జూడక చేయనెంచెడి కార్యములను బట్టి సకలజనులకును గలుగఁబోయెడి కష్టనష్టములను దెలియఁబల్కుచు వారలను వెనుకకు మరల్పవలయును. లేకున్న ధనికులకును భూస్వాము లకును సంభవింపఁబోవు వ్యయ ప్రయాసములకు మితియే లేక పోవును. ఇది తథ్యము. ఇన్ని మాటలేల! సత్యాగ్రహులు తలంచునట్లుగా నింగ్లీషు ప్రభుత్వము నారొక సంవత్సరము దను కను భారతమహాసామ్రాజ్యభార మెల్ల భరతఖండవాసులతలపై నిడి తాము పైనుండి యెవ్విధముగను బరామర్శింపక పాయు వారైె యూరకుండిన పక్షమునఁ గొన్ని నెలలలోనే జాతిమ తాదిభేదములనుబట్టి రాజ్యమంతయునుభిన్నభిన్నములై యొక జాతివారు మఱొకజాతివారలతోడను, నొక మతమువారలు మఱియొక మతమువారలతోడను గలహించి యంత మొందుదురు. అప్పుడు దేశమరాజకమై మహారణ్యసదృశమై పోవునని

చెప్పవలయునా! *కావున మనదేశాభివృద్ధికై బహుభంగులను గృషిసల్పెడి యాంగ్లప్రభుత్వమే చిరకాల ముండవలయునని విశ్వేశ్వరుని వేఁడికొనుచు మనుజులు కృతజ్ఞతతోడను బ్రభుభక్తితోడను బ్రవర్తింపవలయును.

---

* మన మింకను మనదేశమును బరిపాలించుకొను నెడి సామర్థ్యము లేనివార మనుట కుదాహరణముగా నిదివఱ కెన్నడును లేని "ఆంధ్రవిశ్వవిద్యాలయము" ను బరిపాలకులు ప్రసాదించియుండఁగా నది నెలవు కొనుటకుఁ దగినస్థానమునే నిర్ణయించుకొనఁజాలక పోయి తుద కాభారమును బరిపాలకులకే యొసఁగితిమి. అట్లగునపుడు రాజ్యభారము [illegible]అదు వారలము. మరల నీదేశమును నేయవనుల పాలుఁ జేయుటకో యిట్టి దుష్ట ప్రయత్నములుగాని ప్రజాక్షేమమునకుఁ గాదు. దీనిని బాగుగాఁ బ్రజ లాలోచింపవలసియున్నది.

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి. 5870—31

# కాణ్వీయ గ్రంథ రత్నమాలయందుఁ

కటింపఁబడిన

## గ్రంథములు

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| కాణ్వశతపథము (బ్రాహ్మణము) | 10 | 0 | 0 |
| కాణ్వసంహిత (వేదము) | 3 | 0 | 0 |
| వాజసనేయచరిత్రము | 2 | 0 | 0 |
| గాయత్రి (సకల భాష్యములు గలవు) | 0 | 3 | 0 |
| ఆంధ్రవచన యాజ్ఞవల్క్యస్మృతి | 0 | 8 | 0 |
| దత్తో రామాయణము | 0 | 12 | 0 |
| మల్లయుద్ధబోధిని | 0 | 2 | 0 |
| తిలక ధారణ విధి | 0 | 2 | 0 |
| శంకరజీవితము (అద్వైతము) | 0 | 4 | 0 |
| రామానుజజీవితము (విశిష్టాద్వైతము) | 0 | 4 | 0 |
| కాణ్వశాఖాగౌరవము | 0 | 5 | 0 |
| కాత్యాయన సూత్రమంత్రార్థ ప్రకాశిక | 0 | 2 | 0 |
| సంస్కృతాంధ్ర సంఖ్యార్థబోధిని | 0 | 5 | 0 |
| సంస్కృతాంధ్రలకారార్థబోధిని | 0 | 4 | 0 |
| బ్రిటిషు పరిపాలన సౌఖ్యము | 0 | 4 | 0 |

భాగవతుల లక్ష్మీపతిశాస్త్రి

రామచంద్రపురము (గోదావరి)

